# 'ధా' త్రిపదులు

'మట్టిదీపాలు' నుండి 'మల్లెతీగలు' వరకు కవితారంగంలో తనదైన శైలిలో కలాన్ని నడిపిస్తున్న కవి శేఖరులు శ్రీ పి. చంద్రశేఖర్‌గారు. వారి కవిత్వం మొదటి నుంచీ చదివే భాగ్యం నాకు కలిగింది. మంత్రివర్యులైన శ్రీ చంద్రశేఖర్ గారికి కవిత్వమే మంత్రమైంది. అది మామూలు మంత్రం కాదు. వేదమంత్రం. వారు నిజంగా కవిత్వ మంత్రోపాసకులు. "మననాత్ త్రాయతే ఇది మంత్రః" మననం చేసిన వారిని రక్షించేది మంత్రం. అట్లే మననం చేసిన వారిని వారి కవిత కూడా రక్షిస్తుందని నా అభిప్రాయం.

జీవితాన్ని లోతుగా దర్శించి, దానిలోని మంచిచెడ్డలను చమత్కారంగాను, వ్యంగ్యంగాను కవితాత్మకం చేసిన కవి శ్రీ చంద్రశేఖర్‌గారు. వారికి గల సాహిత్య పరిచయం కంటె లోకానుభవమే కవితారంగానికి ఎంతో మేలు చేసింది.

"తెలుగును తెలుగులో చెప్పాలంటే శబ్దాలు కఠినంగా ఉన్నవి". నిజమే తెలుగు పుస్తకాలను దృష్టిలో పెట్టుకొని కవి అన్న మాటలివి. ప్రాథమికంగా తెలుగు పిల్లలను ఆకర్షించడానికి తెలుగు పండితులు చేయవలసింది ఎంతో ఉంది. కాని దీర్ఘ సమాసజటిలమైన, ప్రౌఢమైన పాఠ్యాంశాలను ప్రణాళికలో ఉంచి తెలుగును తెలుగువారికే దూరం చేయడం కవి మనోవేదనకు కారణమైంది.

గుండెను సంస్కృతంలో హృదయం అంటారు. హృదయమంటే మనస్సని కూడా అర్థం. కనుకనే గుండెలోని ప్రేయసి అంటే మనస్సులోని ప్రేయసి అనే అర్థం చేసుకోవాలి. హృదయానికి అనువాదమైన గుండెను మనస్సుకు పర్యాయపదంగా వాడుకోవడం తెలుగువారికలవాటైంది.

"గుండెకు అయిన గాయాన్ని
ఎవరికి చూపగలవు?
మందు నీవే రుద్దుకోవాలి"

మనస్సుకు ఐన గాయాన్ని ఎవరికి వారే గుర్తించి, చికిత్స చేసుకోవాలనడం ఆత్మావలోకనం అవుతుంది.

అవసరమైంది దొరకనప్పుడు ఆరాటపడడంలో తప్పు లేదు. పోరాటానికి దిగినా పొరపాటు లేదు. కాని, కావలసింది సమృద్ధిగా లభించినప్పటికీ ఇంకా దోచుకోవడం ఎంతవరకు న్యాయమని న్యాయశాఖామంత్రి కూడా ఐన కవి ప్రశ్న.

"సమృద్ధిగా ఉన్నది ఇక్కడ
కడుపు నింపుకోవడానికి
కాని అందరూ దోచుకునేవాళ్లే"

ఈ త్రిపది నన్ను ఉపనిషత్తుల్లోకి తీసుకొని వెడుతుంది.

"పరమ పురుషుని సృష్టిలోగల అన్న భండారమ్ము గొప్పది
చిన్నోటితో తిన్నదంతా నామమాత్రం కాక యేమగు?" - బృహద్గీత,, 1.5.16

వ్యవస్థను ఎప్పటికప్పుడు ప్రక్షాళనం చేయవలసిన బాధ్యత పరిపాలకులదే కాదు కవులది కూడా. పరిపాలనాదక్షతతో పాటు, కవితాదక్షత గల శ్రీ చంద్రశేఖర్ గారు ఆ పని చేస్తున్నారనిపిస్తుంది.

న్యాయవ్యవస్థలో లోపభూయిష్టమైన విధానం తప్పుడు సాక్ష్యం ఇవ్వడం. దీన్ని కవి గర్హిస్తున్నారు.

"దేవునిపై ప్రమాణం చేసి
సాక్ష్యాలు చెబుతున్నారు
కాని సమాజమే నమ్మడం లేదు"

శ్రీ చంద్రశేఖర్ గారి కవిత అనుభవ రసాయనం అంటానికి వారి కవితా పంక్తులెన్నైనా ఉదాహరించవచ్చు. కొంగ్రొత్త ఉపమానాల ద్వారా చెప్పవలసిన విషయాన్ని రక్తి కట్టించడం వారికి బాగా తెలుసు. వారొక చోట కలాన్ని ప్రియురాలితో పోల్చారు. ప్రియురాలికి దయలేనట్లే కాలానికీ లేదని చమత్కరించారు.

"కాలమెంత నిర్దయ గలది!
చెప్పకుండా వెళ్లిపోయింది
ప్రియురాలు అంతేగా మరి"

ఇందులోని మొదటి రెండు పంక్తులు బింబమైతే, మూడవ పంక్తి ప్రతిబింబం. ఇది దృష్టాంతాలంకారానికి చక్కని ఉదాహరణ.



మనిషిది ప్రతిక్షణం జీవన్మరణసమస్య. అడుగడుగునా అవాంతరాలే. అయినప్పటికీ సంయమనశీలి, కార్యశీలి కావాలన్నది కవి హృదయం. కర్తవ్యాన్ని విడువరాదన్నది నిశ్చితార్థం.

"భూమి కంపిస్తుంది
ఆకాశం రోదిస్తున్నది
రెండింటి మధ్యన గాలి నవ్వుతూ సాగుతుంది"

కొత్త పాతల మేలుకలయిక క్రొమ్మెఱుంగులు చిమ్మాలని మహాకవి గురజాడ ఆశించాడు. అట్లే కొత్తదనం వరదలో కొట్టుకొనిపోతున్న వాళ్లను ఒడ్డుకు చేర్చి విలువలను గుర్తుకు తెస్తున్నారు శ్రీ చంద్రశేఖర్‌గారు.

"కాలం కలుపుతుంది
కొత్తవాళ్లను
మనసెందుకు కోరదు పాతవాళ్లను?"

కాలం, మనస్సు రెండూ జడపదార్థాలే. శాస్త్ర ప్రకారం తొమ్మిది ద్రవ్యాలలో అవిరెండు. ఈ రెండూ మనల్ని వెన్నంటి ఉంటాయి. అయితే కాలానికి లేని విలువ మనసుకు ఉంది. సృష్టిలో మనిషి ఆవిర్భవించిన నాటి నుండి మనస్సు అతణ్ణి అంటి పెట్టుకొని ఉంది. వాఙ్మనః సమ్మేళనంతోనే మనుష్య నిర్మాణం జరిగింది. జన్మజన్మల సంస్కారాలను పదిలంగా భద్రపరిచేది ఈ మనస్సే. కనుక గతాన్ని అంత తొందరగా మరిచిపోదు. మరిచిపోతే అది మనస్సే కాదు. అందులో పాతమిత్రులను మరిచిపోవడం కంటె కఠినమైన పని మరొక్కటి ఉండదని కవి అభిప్రాయం. మనసు విలువను కవి మనకు జ్ఞాపకం చేయడం అభినందనీయం.

పరిపాలనలో నిరంతరం తలమునకలయ్యే శ్రీ చంద్రశేఖర్ గారు "పరిపాలన ఒక తమాషా వీలయితే నీవూ చేయి" అని రాజకీయాలను విమర్శించేవారికి ఒక సవాలు విసిరారు. దూరంగా ఉండి చూస్తే ఏమీ తెలియదు. దొరబడితే గాని కష్టం ఏంటో తెలిసివస్తుంది మరి! లోకం మనల్ని బ్రతకనివ్వదు. కష్టాల్లో పాలు పంచుకోదు. సుఖంగా ఉంటే ఓర్వదు. పైగా నవ్వుతుంటుంది.

"నవ్వితే కదా తెలిసేది
నా బాధలపై
ఎంతమందికి సానుభూతి ఉందో?"

మన బాధల్ని చూసి నవ్వేవాళ్లే సానుభూతిపరులని చెప్పడంలో ఎంతో వ్యంగ్యం ఉంది.

ఆర్ద్రత కవికుండవలసిన ప్రధానలక్షణం. అది శ్రీ చంద్రశేఖర్ గారిలో పుష్కలంగా ఉంది. ఈ కవికి దారిలో ఓ పూల మొక్క కనిపించింది. అది కంటనీరు పెట్టడంతో వారి మనస్సు తట్టుకోలేకపోయింది. కారణం ఏమంటే ఎవరో తన సిగలోని పూవును తెంపుకొన్నారట! కనుకనే కవి సింపుల్‌గా పిల్లకు తల్లి చెప్పినట్లు "పూయడం నీ తప్పు. సహజమే కదా త్రుంచుకోవడం" అని ఓదార్చారు. ముద్దుగా మూడు మాటల్లో, నాటకీయంగా పూలమొక్క బాధనూ, తన ప్రతిస్పందననూ ఎరుకపరచిన కవి ప్రతిభ సామాన్యమైందని చెప్పలేము.

ఎదుటివాడు ఎదిగిపోతుంటే చూడలేని లోకాన్ని గూర్చి కవి ఏమంటారో చూడండి.

"ప్రియమైన మేఘం చూసి
నెమలి నాట్యమాడితే
ఆకాశం ఏడ్చింది"

ఈ కవితలో పైకి ఆకాశం ఓర్వలేనిదిగా కనిపిస్తుంది. ఇది లోకస్వభావాన్ని తెలియజేస్తుంది. కాని కవి ప్రతిభ అక్కడే అద్భుతంగా పనిచేసింది. ఇది ముచ్చటగొలిపే వర్షాకాల వర్ణన! మనకు కావలసింది ఏడ్చే ఆకాశం లాంటి మనిషి కాదు, హర్షించి వర్షించే ఆకాశంలాంటి మంచి మనిషి అని వ్యంగ్యం (వాచ్యార్థం కంటె భిన్నం)గా గొప్ప సందేశాన్ని ఇస్తున్న కవిత ఇది.

బలవంతుడెప్పుడూ బలహీనుల మీదనే ప్రతాపాన్ని చూపెడుతాడు అని చెప్పడానికి ఈ క్రింది కవితను ఉదాహరణగా చూపవచ్చు.

"పిచ్చిది తుఫాను
ఎంత బలముంటే ఏమి?
గుడిసెనే కదా కూల్చేది!"

పిచ్చిది తుఫాను అనడం వల్ల బలవంతుల అనాలోచితమైన, అహంకార పూరితమైన చేష్టలు బహిర్గతమౌతాయి.

శ్రీ చంద్రశేఖర్ గారి కవితలు భావుకతకు, తాత్త్వికతకు ఆలవాలమైనవి.

"చీకటి వెనుకనే



వెలుగు దాగి ఉందని తెలుసు
మరి భయం దేనికి?" అంటారు వారు.

"తమసో మా జ్యోతిర్గమయ" అన్నది ఋషుల మాట. చీకటిని తొలగించుకొని వెలుగులోకి వెళ్లమని దాని అర్థం. ఐతే చీకటిని ప్రయత్నపూర్వకంగా ఛేదించక పోయినప్పటికీ, దాని వెన్నంటి ఉన్న వెలుగు సహజంగా మనకు తోడ్పడుతుందని కవి అనుశీలన. నిజమే వెలుగు అనేది ఒకటి ఉందని తెలిసినప్పుడు మృత్యువుకు కూడా భయపడవలసిన పని ఉండదు. "జ్ఞానాన్ముక్తిః" అని కదా వేదాంతదర్శన కర్త వ్యాసుడు వచించింది!

లోకంలో కొందరు త్యాగపురుషులుంటారు. వారు తమ కోసం ఏమీ చేసుకోరు. ఈ సత్యాన్ని లోకోత్తరంగా తెలియబరుస్తున్న కవితోక్తి ఇది –

"అందరికి సమయం చూపించే
గడియారం
తన టైం తాను చూసుకోలేదు"

అందరికీ దారి చూపే త్యాగపురుషునికి గడియారం సంకేతమైంది. ఇది మంచి పోలిక.

ఈ వీచికల్లో కవి ఉక్తివైచిత్రిని ప్రదర్శించి, వ్యంగ్యవైభవాన్ని సాధించారు. ఒక్కొక్క వీచికను వ్యాఖ్యానించాలనిపిస్తుంది నాకు. ఒక చోట తమ మనస్సులో గీసుకొన్న మానవత్వపు బొమ్మ ఎటో పోయిందని, అది ఎవరికైనా కనిపించిందా? అని ప్రశ్నించడంలో కవితాపరమైన చమత్కారమే కాక, మంచితనానికి విలువ లేకపోతుంది గదా అనే ప్రగాఢమైన కవి ఆవేదన తొంగిచూస్తుంది.

శ్రీ చంద్రశేఖర్‌గారు సమాజాన్ని 'లోనారసి' విశ్లేషించడం ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఈనాటి లోకం పోకడను కవి బాగా గుర్తించారంటానికి మరొక ఉదాహరణ ఇస్తాను.

"సినిమా పాటలతో
భగవంతుని భక్తిగీతాలు,
దయచూడు స్వామి!"

ఈ రోజుల్లో సినిమాల్లో చూసి భక్తి అంటే ఇలా ఉంటుందని అర్థం చేసుకునే పరిస్థితి ఏర్పడింది. పండుగొచ్చినా, పబ్బమొచ్చినా లౌడ్‌స్పీకర్లతో సినిమా భక్తిగీతాలను

వినడం మామూలైంది. సినీరంగమే భక్తికీ, ముక్తికీ సోపానం కావడం మన దురదృష్టమనక తప్పదు. భక్తిగీతాలు భగవంతునివే కనుక, అవి ఎలాగూ సినిమా పాటల రూపంలో వింటున్నందుకు భక్తవత్సలుడైన ఆ భగవంతుడే మనను దయ చూడవలసి ఉందని కవి చమత్కారం!

నూటికి నూరుపాళ్లు సామాజిక స్పృహతో నవనవోన్మేషంతో కవితారచన చేస్తున్న శ్రీ చంద్రశేఖర్ గారు ఇప్పటికీ ఎనిమిది కవితాసంపుటాలను వెలువరించారు. ఇప్పుడు నిజంగా వారి కవిత అష్టదళ పద్మం!

మహాకవి సి. నారాయణరెడ్డిగారు "ప్రపంచపదులు" రచించి ప్రపంచతత్త్వాన్ని ఆవిష్కరించినట్లే శ్రీ చంద్రశేఖర్ గారు ముచ్చటగా మూడు పంక్తుల్లో ఈ వీచికలు రచించారు. వీటికి నేను 'ధా'త్రిపదులు అని నామకరణం చేస్తున్నాను. మూడు పాదాలుండడం వల్ల అవి త్రిపదులు. ధాత్రి (లోక) సంబంధమైనవి కనుక అవి 'ధా'త్రిపదులు.

ఆత్మీయ కవితామూర్తి మాన్యశ్రీ పి. చంద్రశేఖర్‌గారి 'వీచికలు' సదా సహృదయ జన భావవీచికలై అలరారాలని ఆకాంక్షిస్తూ, నాకు ఈ అవకాశం లభించినందుకు సంతోషిస్తున్నాను.

*పి. చంద్రశేఖర్ 'వీచికలు' పుస్తకానికి*

*జులై, 2003*



# ప్రబోధామృత స్వరాలు

"తమ్ముడు లక్ష్మణుండు పెద తమ్ముడు యా భరతుండు చేరి వి
ల్లమ్ములు దాల్చి నిల్వ చరణమ్ములనంటియు నాంజనేయుడా
నమ్మినబంటు కొల్వ విభవమ్మున బంగరు గద్దె మీద సీ
తమ్మ సమేతుడౌ దశరథాత్మజు శ్రీ రఘురాము గొల్చెదన్"

ఈ పద్యం చాలు శ్రీ నమశ్శివాయగారి వేంకట నరసింహులు పద్య ధారా కౌశల్యం ఎలాంటిదో చెప్పడానికి. ఈ పద్యం ద్వారా కవి ఆంజనేయ, భరత, లక్ష్మణ, సీతా సమేతుండైన శ్రీరాముని వైభవాన్ని మన కళ్ల ముందు ఒక చిత్రంగా భాసింప చేశాడు. ఇట్టి రచనా శిల్పాన్ని కవి ఇతర పద్యాల్లోను చూడవచ్చు.

భగవద్భక్తికీ, దేశనాయక స్తుతికీ శ్రీ వేంకట నరసింహులుగారు పెద్దపీట వేశారు. ఈ రోజు ముఖ్యంగా మనుష్యుల్లో సన్నగిల్లిన ఈ రెంటిని గుర్తించారనిపిస్తుంది.

"తెల్లవారల యుక్కు పాదాల నలిగి
భారతీయులు నడపీన్గులైరి" అని నాటి భారతీయుల దుస్థితికి ఎంత చింతిస్తారో స్వాతంత్ర్యానంతర కాలంలో నేడు కనిపించే బాధాకరమైన పరిస్థితికి కూడా వారు అంతే బాధపడుతారు.

"అక్కట రామరాజ్యమిదియా? నిరుపేదల యార్తనాదమే వెక్కసమాయె" అని రామరాజ్యం గురించి గాంధీజీ కన్న కలలు ఏ విధంగా నిష్ఫలమయ్యాయో ఎత్తి చూపారు.

"ఆకలిబాధల యలజడి
రాకసి కోరికలు దొంగ వ్యాపారంబుల్
సాకిన పార్టీ గ్రూపులు
పీకల కురిత్రాళ్లు గావె! పేద ప్రజలకున్"

అంటూ నేటి సామాజిక స్థితిని, వ్యాపార సంస్కృతిని, ఆయా పార్టీల స్వార్థ బుద్ధిని స్పష్టం చేశారు. శాంతిసహజీవనాలు సమసిపోయినందున "విశ్వశాంతి

కొండెక్కెను" అని కవి వాపోయారు. కొందరీ కాలాన్ని అభ్యుదయమనీ, వైజ్ఞానికమనీ, యాంత్రికమనీ, అణుయుగమనీ పెద్ద పెద్ద పేర్లతో పిలుస్తారు గాని వారికి దేశ సంస్కృతి పట్ల కనీస పరిజ్ఞానం లేకపోవడం విచారింపదగిందని కవి భావిస్తారు. అటువంటి వారిని తన భాష తన వేషమును సంస్కృతిని వీడి ప్రకృతికి వికృతులై బ్రతుకువారు అని ఎత్తి పొడుస్తారు. 'అక్షరప్రభ' శీర్షికన శ్రీ వేంకట నరసింహులు గారు రచించిన కవిత ప్రభోదాత్మకమైంది. నిజంగా నిరక్షరాస్యులకది అక్షరప్రభ!

'అక్షరాస్యత లేక అల్లాడు ప్రజలకు శీలసంస్కారమేతీరునబ్బు' - మనిషిని మనిషిగా దిద్దితీర్చగలిగిన చదువులు ఈ రోజు మృగ్యమయ్యాయి. చదువుకొన్న వారిలోను సంస్కారం ప్రశ్నార్థకమే. కనుక కవి శీల సంస్కారాన్ని పెంచే అక్షర జ్ఞానానికి ప్రాముఖ్యం లభించాలని కోరారు.

'హలము పట్టిన చేతనే కలము పట్టిన' బమ్మెర పోతనను గూర్చి, పొష్యలక్ష్మిని గూర్చి వ్రాసిన పద్యాలతో పాటు తదితర గేయఖండికలు సహజ కవితా మాధుర్యాన్ని చవి చూపిస్తున్నాయి. ముఖ్యంగా 'దాత' అనే గేయకవిత రంతి దేవుని దాతృత్వానికి ఎత్తిన పతాక! పిన్నలకు సైతం అర్థమయ్యే శైలిలో రచింపబడింది.

ఈ కాలంలో కమ్మగా పద్యాలు చదివే వాళ్లు కరవైనట్లే కమ్మని పద్యాలు రాసే కవులు కూడా కరవౌతున్నారు. నేటి పద్య కవులను వేళ్ల మీద లెక్కపెట్టవచ్చు. నందూరి రామకృష్ణమాచార్య, ఉత్పల సత్యనారాయణచార్య, ఆచార్య తిరుమల, వేముగంటి నరసింహాచార్యులు, రాళ్లబండి కవితాప్రసాద్, దాశరథుల బాలయ్య, దత్తాత్రేయ శర్మ, జి.ఎం. రామశర్మ, ఆచార్య ఫణీంద్ర, రసరాజు, రాధశ్రీ వంటి కవులు కమ్మని పద్యాలతో తెనుగు భారతిని కైసేయడం చూస్తున్నాం. వారి మధ్యన నిలువ గలిగిన మధుర కవి శ్రీ నమశ్శివాయగారి వేంకట నరసింహులుగారు.

శ్రీ నరసింహులుగారి జీవన సంస్కారమే ఈ 'వంశీ స్వరాలు' కవితా సంపుటియంతటా పరచుకొన్నది. యాభై సంవత్సరాల నుండి రాస్తున్న కవితలైనా ఈనాటికీ తాజాగా ఉండి వాస్తవికతకు అద్దం పడుతున్నాయి.

"నీవు నేర్చిన చదువులు సమాజాన్ని
ఇరకాటంలో పెట్టొద్దు
పెరిగిపోతున్న సాహిత్యంలో



జాతి సౌశీల్యం చెడిపోవద్దు
పరభాషా వేషాల్లోన
మన సంస్కృతి చెడిపోవద్దు"

నరసింహకవి ఈ మాటలతో ఏకీభవించని వారెవరూ ఉండరు. చాలా కాలం తర్వాతనైనా వారి ప్రతిభ అక్షరరూపంలో ఆవిష్కృతం కావడం, సహృదయ సాహితీవేత్తలకు మహదానందాన్ని కల్గిస్తుందనే చెప్పాలి. ఈ కవివర్యుని సాహిత్యాన్ని అనుశీలించే అవకాశాన్ని కల్గించిన వర్ధమాన సాహితీ మిత్రులు శ్రీ వి. విజయకుమార్ గారిని అభినందిస్తూ శ్రీ నమశ్శివాయగారి వేంకట నరసింహులు గారి సంస్కారోపేతమైన ప్రజ్ఞకు జోహర్లు అర్పిస్తున్నారు.

*నమశ్శివాయగారి వేంకట నరసింహులు 'వంశీ స్వరాలు' పుస్తకానికి*

*8-2-2000*

# అమృతవాహిని

గృహస్థాశ్రమంలో ప్రవేశించకుండానే పరివ్రాజకుడై పరమపురుషుని సేవకై తన జీవితాన్ని అంకితం చేసిన ఆచార్య శ్రీధరుడు అభినందనీయుడు.

సాహిత్యజగత్తులో వేదం ప్రథమగణ్యం. వేదోక్తంగా నడుస్తూ, నల్గురికి తజ్జీవన మాధుర్యాన్ని అందిస్తున్నవారే ఆర్యులు. ఆర్యులంటే శ్రేష్ఠులు. వారొక మతానికి చెందిన వారు కారు. శ్రీధరుడు ఆర్యుడు. వేద ధర్మావలంబకుడై తద్ధర్మాన్ని ప్రచారం చేస్తున్న ఆచార్యుడాయన.

శ్రీధరుని కలం నుంచి లోగడ ఒందు రెండు కృతులు జాలువారాయి. వాటిలో ఆగ్నేయాస్త్రం సామాజిక రుగ్మతల మీద ఎక్కుపెట్టిన అక్షర మహాస్త్రం. "ఓ చీకటిని చంపేద్దాం, తెస్తావా? వెలుగు రవ్వల ఖడ్గధార" అని మనల్ని ప్రోత్సహించాడందులో. ఆ చీకటి మరేదో కాదు, మన అజ్ఞానమే. "వేదమంత్రపు నాదమై పరవశిస్తాను" అని ఎలుగెత్తి చాటిన శ్రీధరుడు ఆధునిక యువకవుల్లో అగ్నిశిఖ. కనుకనే ఆగ్నేయాస్త్రం ద్వారా కురిపించిన అగ్ని వర్షానికి ఆహుతి కాని అవైదిక దురాచారం లేదంటే అతిశయోక్తి కాదు. శ్రీశ్రీ మహాప్రస్థానం మార్క్సు దృష్టితో విప్లవాన్ని ప్రబోధిస్తే శ్రీధరుని ఆగ్నేయాస్త్రం వైదిక సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకొని మనిషి అనుసరించాల్సిన ధర్మాన్ని ప్రబోధిస్తుంది. ఏకపక్ష సందేశం శ్రీశ్రీ కవితాలక్ష్యం. కాని అఖిలపక్ష సందేశం శ్రీధరుని కవితాలక్ష్యం.

పదునైన భాషతో సమాజాన్ని బాధిస్తున్న దురాచారపు ముళ్లను ఖండించడంలో ఆరితేరిన శ్రీధరుడు సరళమైన భాషలో ఈశ్వరుని స్వరూపాన్ని వైదిక సంస్కృతిని "వేదవాహిని"లో గానం చేశాడు.

ఆగేది పద్యం, సాగేది పాట అని నా అభిప్రాయం. శ్రీధరుడు ఆయా బాణీలలో కమనీయంగా రమణీయంగా రచించిన పాటలకు "వేదవాహిని" అని నామకరణం చేశాడు. వేదం సజీవ స్రవంతి. అది మూడు కాలాల్లో ప్రవహిస్తూ ఉంటుంది. దరి చేరిన వారిని పవిత్రులను చేసే శక్తి దానికి తప్ప మరొక్కదానికి లేదంటే అతిశయోక్తి



కాదు. వేదమంత్రాలను ఎంతటి గాఢాభినివేశంతో పఠిస్తే అంతటి ఉత్సాహం మనకు ప్రాప్తిస్తుంది.

"నిరాకారుడు ప్రభువు అన్నింటనిండె
అందరునూ మనవారే పరులెవ్వరు లేరు"

అందరికీ ప్రభువు ఒక్కడే. నీ ప్రభువు, నా ప్రభువు అని ఉండరు. వీధికో దేవుడు అజ్ఞానం. విశ్వవిద్యాలయానికో చదువు అజ్ఞానం.

దైవం యూనివర్సల్
ధర్మం యూనివర్సల్
వేదజ్ఞానం యూనివర్సల్

సృష్టి నిర్మాతకు ఆకారం లేదు. ఆయన పుట్టడు. పుడితే కదా శరీరమూ, ఆకారమూ ఉండేవి. ఆయన అజుడు. పుట్టుకలేనివాడు. కనుకనే అంతట ఉన్నాడు. ఇక అతనిలో ఉన్న మనం అంతా అతని బంధువులమే. మనందరి కోసం దైవం, ధర్మం, వేదం. అనేక దేవతారాధన అవైదికం. హింసాప్రవృత్తులు అవైదికం. వేదంతో సాటి రాగల వాఙ్మయం సృష్టిలో లేదు. వేదోక్తమే యుక్తం. యుక్తమైన దానితో కలవడమే సంయుక్తం. నిరాకార పరబ్రహ్మాన్ని ఉపాసించడమే మనందరి కర్తవ్యం.

ఈ గేయసంపుటిలోని విషయసూచికను పరిశీలిస్తే శ్రీధరుని వైదిక ధర్మాభిరుచి సువ్యక్తమౌతుంది. ఆయన ఏవో కూనిరాగాలు తీస్తూ కానీల కోసం రాసిన పాటలు కావివి. అతని హృదయాంతర్మథనంలోంచి వెల్వడిన జ్ఞానరోచిస్సులివి. ప్రతి శీర్షిక ఒక సందేశాన్ని ఇస్తుంది.

ఉదాహరణకు 'ఆత్మ తెలిసినోడే సత్యజ్ఞానిరా' అనే శీర్షికను పరిశీలిస్తే కవి ప్రత్యయం ప్రత్యక్షమవుతుంది.

"ఆత్మ తెలిసినోడే సత్యజ్ఞానిరా
అందాకా ప్రతివాడూ బాలుడేనురా"

నాకు అది తెలుసు, ఇది తెలుసు అని చెప్పుకొనేవాళ్లున్నారు. కాని ఆ తెలిసినవి ఏవైనప్పటికీ వాటిలో ఆత్మకు సంబంధించిన యథార్థ స్వరూపం తెలియనప్పుడు ఆ తెలిసినవన్నీ వ్యర్థం అని కవి ఉద్దేశం! అంతేకాదు ఆత్మజ్ఞాని మాత్రమే పండితుడని కూడా అతని ఉద్దేశం!!

ఈ వేదవాహినిలో ఆధ్యాత్మిక విషయపరంపరతో పాటు సామాజిక అంశాలు కూడా చోటు చేసుకున్నాయి.

"చలనచిత్రాలు పత్రికలన్నీ
ప్రకటనలూ సాహిత్యమంతా
నారీదేహం, మోహావేశం"

శ్రీధరుని మాటలను కాదని చెప్పగల ఆధునికులెవరుంటారు?

స్త్రీల పట్ల పురుష సమాజం అనుచితంగా వ్యవహరిస్తుంది. శ్రీధరుడు దీన్ని "ఆడది కీడని బాధలు పెడితే మానవజాతే చెడుతుంది" అని ఒక్క మాటలో తేల్చేశాడు.

ఈ వేదవాహిని కేవలం పాటల పుస్తకం కాదు. దుమ్ము పట్టిన మన మస్తకాలని పరిశుద్ధం చేయగల శక్తి గలది. వైదిక జీవన పథంలో మనం ఒక అడుగు ముందుకు వేయగల శక్తినీ, ఉత్సాహాన్నీ ఈ పుస్తకం కల్పిస్తుంది.

చాలావరకు ఈ రోజు సాహిత్యం పేరుతో పిలువబడేది చదివి ఆనందించేదిగాను, విని ఆనందించేదిగాను, వినిపించి ఆనందించేదిగాను ఉంది. కాని సాహిత్యం ఆలోచనామృతం. ఈ వేదవాహినిలో ఉన్నది అమృతం. మనం ఆలోచనాపూర్వకంగా స్వీకరించినప్పుడే అది లభిస్తుంది.

వేదవాహినిలోని ప్రతి గేయం ఒక విజ్ఞాన దీపశిఖ.

"అందగానే దైవముండ కొండల్లో, కోనల్లో తిరిగేవేలా".

వేమన్న కూడా ఇలాంటి భావాలనే వ్యాప్తం చేశాడు. ఐనా ఇంకా మన ఆలోచనలు మారలేదు.

"నీ జీవనమే ఒక అగ్ని
నీ భావనమే ఒక శక్తి
యోగం, యాగం నీ గమనం
త్యాగం, ధైర్యం నీ చలనం"

మొదలైన పంక్తులు ఆలోచించిన కొద్దీ ఆత్మస్థైర్యాన్ని అందిస్తాయి. ఆత్మావలోకనానికి దారి చూపుతాయి.



నాకు పాటల గురించి తక్కువ తెలుసు. వాటి బాణీల గురించి ఇంకా తక్కువ తెలుసు. కాని కవిత్వం గురించి ఇంతో అంతో తెలుసు కాబట్టి ఈ వేదవాహినిలోనూ శ్రీధరుని కవితాంశనే దర్శించాను.

సహృదయులు ఈ పొత్తాన్ని కేవలం పాటల పుస్తకంగా కాక వైదిక జీవన పథానికి మార్గదర్శిగా భావించి చదువుతారని భావిస్తున్నాను. విషయజ్ఞులై ధర్మజ్ఞులై తమ తమ జీవితాలను ధన్యం చేసుకొంటారని ఆశిస్తున్నాను. ధార్మిక సంస్థలు ముందుకు వచ్చి శ్రీధరుని ఇట్టి జ్ఞానవిజ్ఞానదాయకమైన రచనలను వెలుగులోకి తెసుకొని రావాలని విజ్ఞప్తి చేస్తూ కవి, విద్వాంసుడు, ఆచార్యుడు అయిన శ్రీధరుణ్ణి హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

*ఆచార్య శ్రీధరః వేదవాహిని పుస్తకానికి*
*డిసెంబర్, 2003*

# మనం చరితార్థులమవుదాం

త్రాగేనీటిలో ఫ్లోరిన్, పీల్చే గాలిలో బొగ్గు పులుసు వాయువు, సాహిత్యంలో అనారోగ్యకరమైన విషయాలు క్షమించరానివి. చారిత్రక గ్రంథాలే ప్రక్షిప్తాలకు లోనై కేవలం కట్టుకథలుగా మారినప్పుడు ఇక చెప్పవలసిన పనేముంది? ఈ రోజు మనం ఏ వాఙ్మయ ప్రక్రియను స్పృశించినా ఆకర్షణీయమైన అబద్ధాలతో గుబాళిస్తుందే తప్ప సత్య సమాచారాన్ని అందించడం లేదు. "మాటకు ప్రాణం సత్యం" అని మన పెద్దలు చెప్పిన మాటలను ఏ రచయితా పట్టించుకోవడం లేదు. ఇష్టం వచ్చినట్లు రాసి ఇది పాఠకుల ఇష్టం అని ఆ తప్పును ఇతరుల మీద తోసేస్తున్నారు. చారిత్రక గ్రంథాలైన రామాయణ భారతాలే ప్రక్షిప్తాలకు లోనై చైతన్యాన్ని తేటపరచని స్థితిలో ఉన్నప్పుడు అర్వాచీన రచనల గురించి ఇక చెప్పవలసిన పనే లేదు.

మన అదృష్టవశాత్తు వేదాలు ప్రక్షిప్తాలకు లోను కాలేదు. బహుశా ఆ సాహసం మానవుడు చేయలేకపోయాడు. కాని వేదాంగాలను చదవకుండానే వేదోపాంగాలను చూడకుండానే భాష్యాలు రాస్తున్నారు. విపరీతమైన వ్యాఖ్యానాలతో వేదాల్లోని యథార్థ స్వరూపాన్ని తెలియనీయకుండా చేస్తున్నారు.

ఒక వైపు వేదాల యథార్థ స్వరూపాన్ని తెలుసుకోవడంతో పాటు మరో వైపు మన పూర్వుల చరిత్రను యథాతథంగా తెలుసుకోవలసిన బాధ్యత బుద్ధిమంతులైన వారి మీద ఉంది.

"శుద్ధ హనుమచ్చరితం" అధ్యయనం చేసినప్పుడు ఇంత వరకు మనం సాహిత్యం ద్వారా పొందవలసిన దాన్ని పొందలేకపోయామే అని బాధ కలుగుతుంది. ఆంజనేయస్వామి భక్తులను అడిగి చూడండి – వారి దృష్టిలో హనుమంతుడు ఒక కోతి, కాకపోతే దైవం. కాని జాతికి స్ఫూర్తిని ప్రసాదించడంలో రామ పాత్ర ఎంతో హనుమంతుని పాత్ర కూడా అంతే. మనవాళ్లు వీరాధివీరుడు ధర్మప్రభువైన శ్రీరాముణ్ణి దేవుణ్ణి చేశారు కాని, వేదవేదాంగవేత్త, బ్రహ్మచారి, మృదుభాషి అయిన హనుమంతుణ్ణి కోతిని చేశారు. ఇదెంత అసంగతం! ఉన్నది ఉన్నట్లు తెలుసుకొనే అలవాటు మన



దేశవాసులకు తక్కువేమో అనిపిస్తుంది. తెలుగు సాహిత్యం ఉత్తమ మానవుని నిర్మాణానికి కృషి చేయవలసిన సమయం ఆసన్నమైంది. రచయితలు, కవులు భాషను, సంస్కృతిని, చరిత్రను పరిరక్షించే దిశలో రచనలు చేపట్టవలసిన అవసరం ఉంది. అందుకు అవసరమైతే తమ దృష్టిని ఇతర భాషలలో ఉన్న సాహిత్యం వైపు కూడా సారించాలి. అది తప్పదు.

శతాధిక గ్రంథకర్త శ్రీ లోకమలహరిగారు ఈ "శుద్ధ హనుమచ్చరితం" ద్వారా మనకు అపారమైన చారిత్రక సంపద ఉన్నదని గుర్తుకు తెస్తున్నారు. హిందీలో ఈశ్వరీప్రసాద్ రచించిన గ్రంథానికి ఇది తెలుగుసేత.

శ్రీరాముడు తొమ్మిది లక్షల సంవత్సరాల క్రితం ఆర్యావర్తాన్ని పావనం చేసిన మహాపురుషుడు. ఆ మహనీయుని దివ్యజీవితంలో హనుమంతుడు ఒక అంశంగా నిలిచాడు. సత్యపాలనలో శ్రీరాముణ్ణి గుర్తు పెట్టుకొన్నట్లే బ్రహ్మచర్య దీక్షలో హనుమంతుణ్ణి గుర్తు పెట్టుకోవాలి. హనుమంతుడు కేవలం బ్రహ్మచారి కాదు. అతడు రాష్ట్ర భక్తికి ప్రతీక. ఉత్సాహానికి సంకేతం. కర్తవ్యపాలనకు మారుపేరు. మానవత్వానికి గుర్తు.

రాష్ట్ర నిర్మాణోద్దేశం కల్గినవారు హనుమంతుని చరిత్రను తప్పక తెలుసుకొని స్ఫూర్తిని పొందవలసి ఉంది. విశ్వామిత్రుడు శ్రీరాముణ్ణి మహావీరునిగా తీర్చిదిద్దినట్లే అగస్త్యుడు హనుమంతుణ్ణి వీరాధివీరునిగా తీర్చిదిద్దినాడు. హనుమంతుడు అగస్త్యుని ఆశ్రమంలో శిక్షణ పొందాడు. అగ్నికి వాయువు తోడైనట్లు ఇద్దరు వీరులు కలిసినారు కనుకనే రావణుణ్ణి, అతని సైన్యాన్ని మట్టుపెట్టగలిగారు.

లోకరక్షణార్థమై ఋషులు చేసింది ఎంతో ఉంది. వారి ఆజ్ఞను శిరసావహించిన చక్రవర్తులు మహత్కార్యాలు చేసి కీర్తిమంతులైనారు. రామాయణం ద్వారా మానవ సంస్కృతికి ఋషులు చేసిన తపస్సుతో పాటు రామాదులు ధర్మరక్షణ విషయంలో చూపిన శ్రద్ధాభక్తులు స్పష్టమవుతాయి. రామాయణం అనే రత్నహారానికి మణి హనుమంతుడు. అతడు క్షత్రియ వంశ సంజాతుడు. క్షత్రియోచితమైన విద్యలతో పాటు వేద విద్యలను అభ్యసించిన ధీశాలి.

మహావీరుడు, ఆదర్శమానవుడు, అఖండ బ్రహ్మచర్యవ్రతుడు, నీతిమంతుడు, మహామనీషి ఐన హనుమంతుని చరిత్ర ఏనాటికైనా భారతదేశ చరిత్రను పునీతం

చేయగలిగింది. ఆర్యావర్తంలో జన్మించిన అద్భుత చారిత్రక మహాపురుషుడు హనుమంతుడు. అతనిని కేవలం బొమ్మల రూపంలో పూజించడానికి బదులు, అతని నుండి కావలసిన స్ఫూర్తిని పొంది మనం మన దేశాన్ని రక్షించుకొందాం. మన సంస్కృతిని కాపాడుకొందాం. మన చరిత్రను పటిష్టపరచుకొందాం. చరితార్థులమవుదాం.

చివరగా ఒక మాట. ఇంత కాలానికి ఈ గ్రంథం ప్రకాశం పొందడానికి కారణం శ్రీ కోటికె లక్ష్మయ్యగారు. వారు వైదిక జీవన తత్పరులు. త్యాగశీలురు. శ్రీ లోకామల్హరిగారి శతాధిక గ్రంథాలను ఫలాపేక్ష లేకుండా ప్రచురించినారు. శ్రీ లక్ష్మయ్యగారి వల్ల ఈ "శుద్ధ హనుమచ్చరితం" ముద్రింపబడి నిద్రావస్థలో ఉన్న ఆంధ్రజాతికి ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని కల్గిస్తుందని ఆశిస్తున్నాను. అనువాదకర్తతో పాటు ప్రకాశకులు ఇంత మంచి పని చేస్తున్నందుకు అభినందిస్తున్నాను.

***పండిత లోకమలహరి శుద్ధ హనుమచ్చరితము పుస్తకానికి***

***2000***



# విశ్వకర్మ పరమేశ్వరుడు

సృష్టికర్త ఐన పరమేశ్వరుని పేర్లు సార్థకమైనవి. కొన్ని పేర్లు కర్మలను తెలిపేవి కాగా మరికొన్ని పేర్లు స్వభావాన్ని తెలిపేవి. ఇంకా కొన్ని గుణాలను తెలిపేవి. ఉదాహరణకు సృష్టికర్తృత్వం పరమేశ్వరుని కర్మ కనుక అతడు 'సవిత' అని, రక్షించడం అతని స్వభావం కనుక 'ఓ3మ్' అని, స్వయం ప్రకాశకత్వం అతని గుణం కనుక 'అగ్ని' అని పిలవబడుతున్నాడు.

ఇట్లే 'విశ్వకర్మ' అనే పేరు సకలకర్మలకు ఆధారుడనే అర్థాన్ని తెలియజేస్తుంది. కేవలం ఈ అర్థాన్ని మాత్రమే తెలియజెప్పడం ఈ గ్రంథం ముఖ్యోద్దేశం కాదు. విశ్వకర్మ పేరుతో వ్యవహరింపబడే పరమేశ్వరుని యథార్థ తత్త్వాన్ని ఆవిష్కరింపజేయడమే దీని పరమోద్దేశం.

లోకంలో పరమేశ్వరుణ్ణి రకరకాల పేర్లతో ఆరాధిస్తున్నాం. కాని ఆ పేర్ల అంతరార్థాన్ని శాస్త్రీయంగా తెలుసుకోలేకపోతున్నాం. ఉదాహరణకు 'విశ్వకర్మ' అనే పేరు కూడా అలాంటిదే. బ్రహ్మశ్రీ నంచర్ల వేంకటరామాచారిగారు వేదాధ్యయనశీలురు. ఋత్విజులు. కనుకనే ఈ గ్రంథంలో విశ్వకర్మ శబ్దార్థాన్ని తెలియజేయడానికి వేదవేదాంగాల నుంచి ప్రమాణాలను చూపినారు. విశ్వకర్మ విశిష్టతను లోకానికి తెలియపరిచినారు. మనచేత ఉపాసింపబడే విశ్వకర్మ సృష్టికర్త అని, పరమేశ్వరుడని, సర్వజ్ఞుడని, సర్వశక్తిమంతుడని, స్వయం ప్రకాశకుడని, సర్వవ్యాపకుడని నాల్గు వేదాల నుంచి అనేక మంత్రాల ఆధారంగా నిరూపించినారు. ఇదొక విధంగా వైదిక పద్ధతిని అనుసరించి సాగిన పరిశోధన అని చెప్పాలి.

ఇట్లే సృష్టికర్త ఐన విశ్వకర్మ వేరు; అంగిర వంశజుడు, మంత్రార్థద్రష్ట, భువనపుత్రుడైన విశ్వకర్మ వేరు అన్న విషయాన్ని ఆధారాలతో రచయిత వివరించినారు. విశ్వకర్మ విషయంలో మనకున్న భ్రమలను తొలగించినారు.

పరమేశ్వరుడు మంత్రస్రష్ట, ఋషులు మంత్రద్రష్టలు. ఋషులను మంత్రకర్తలుగా చెప్పరాదు. లోకంలోని విశ్వకర్మలు భువనపుత్రుడైన విశ్వకర్మ సంతతికి

చెందినవారు. విరాట్ స్వరూపుడు, సృష్టికర్త ఐన విశ్వకర్మ పరమేశ్వరుణ్ణే ఆరాధించాలన్న గ్రంథకర్త అభిప్రాయం ఎల్లరకు శిరోధార్యం.

శ్రీ నంచర్లవారు వైదిక పురోహితులు. సంఘంలో విశ్వకర్మ పేర జరుగుతున్న పూజావిధానాన్ని గమనించి, వేదోక్త పరమపురుషుడైన విశ్వకర్మ విశిష్టతను తెలియజేసినారు. వైదికపథం నుంచి వైదొలగిన మనల్ని తిరిగి పథగాముల్ని చేయడమే ఈ గ్రంథకర్త ప్రథమ లక్ష్యంగా కనిపిస్తున్నది. అది ఈ రచన ద్వారా నెరవేరిందనే భావిస్తున్నాను.

విశ్వకర్ములుగా నేడు పిలవబడుతున్నవారు మౌలికంగా శూద్రులు కారనీ, వైదిక సిద్ధాంతం ప్రకారం అగ్న్యాదానాధికారం వారికుందనీ, శిల్పకర్మను అధ్యయనం చేసి, దానికి క్రియాత్మక రూపాన్ని ఇవ్వడం బ్రాహ్మణలక్షణం కనుక శిల్పకర్మ బ్రాహ్మణ కర్మ అనీ, ఆ కారణంగా విశ్వకర్మలు విశ్వబ్రాహ్మణులనీ, విశ్వకర్మల పేర్ల చివర గల ఆచార్య శబ్దం ఈ విషయాన్ని ధ్రువపరుస్తుందని శ్రీ నంచర్లవారు చేసిన ప్రతిపాదన సత్యసమ్మతమైందనే నేను భావిస్తున్నాను. విశ్వబ్రాహ్మణులను తిరిగి వైదిక సాంస్కృతిక జీవనంలోకి ఆహ్వానించడమే రచయిత ముఖ్యోద్దేశం. విశ్వకర్మలలో అలముకొన్న న్యూనతాభావాన్ని పోగొట్టడానికి రచయిత చేసిన కృషి ప్రశంసనీయమైంది.

నిజానికి వైదిక వర్ణవ్యవస్థ స్వరూపాన్ని తెలుసుకోకపోవడం వల్లనే కులం, జాతి ఏర్పడి వ్యవస్థ క్రమంగా అవస్థల పాలైంది. ఏనాటికైనా కులాలను నిర్మూలించి మానవజాతిని ఏకీకృతం చేసే వ్యవస్థ వర్ణానిదే. అభ్యుదయానికి అడ్డుగోడగా నిలిచిన కులతత్వాన్ని కాదని, ఆచార్యత్వాన్ని పునఃప్రతిష్ఠించుకొనే విషయంలో జాగరూకత వహించాల్సిన తక్షణ అవసరాన్ని ఈ గ్రంథం గుర్తు చేస్తుంది.

ఋషి ఐనవాడే కవి. అలాగే పూర్వం రాజులు, చక్రవర్తులు కూడా ఋషులైనవారే. ఉదాహరణకు జనకుడు చక్రవర్తి, ఋషి కూడా. అలాగే భువనపుత్ర విశ్వకర్మచక్రవర్తి కూడా మహర్షియే. కనుకనే అతడు వేదానుకూలమైన రాజ్య ప్రణాళికను ప్రప్రథమంగా నిర్మించగలిగినాడు.

మనమీనాడు వేదాన్ని విడిచిపెట్టి వేదనకు లోనయ్యాం. ఆత్మజ్ఞానాన్ని విడిచి ఆత్మన్యూనతాభావానికి లోనయ్యాం. అవైదిక కార్యకలాపాలతో జీవితాన్ని దుర్భరం చేసుకొన్నాం. ఇలాంటి సందర్భంలో సంస్కరణ దృక్పథం గల ఒక రచయిత ద్వారా వెలువడుతున్న విశిష్టమైన రచన 'విశ్వకర్మ విశిష్టత'.



ఈ గ్రంథం ద్వారా పరమేశ్వరుని స్వరూపాన్ని సమగ్రంగా తెలియజేయడమే గాక నాలుగు వేదాల నుంచి విశ్వకర్మ సూక్తమంత్రాలను కూడా ఇచ్చి ఉపాసకులకు మహోపకారం చేసినారు శ్రీ నంచర్లవారు. వాస్తుతత్త్వవేత్త, సదాచార సంపన్నులు, స్వాధ్యాయవ్రతులు శ్రీ నంచర్ల వేంకటరామాచార్యులుగారిని ఈ సందర్భంగా ఆత్మీయతా పూర్వక స్నేహాంజలులర్పిస్తూ అభినందిస్తున్నాను.

**నంచర్ల వేంకటరామాచారి 'విశ్వకర్మ విశిష్టత' పుస్తకానికి**

***2001***

# సృజనానుశీలనం

"భావన గల పద్యములకు
కావింపు ప్రచారమెపుడు – కవి రాధశ్రీ" – రాధశ్రీ రత్నశతకం.

తానే అని డా॥ రాధశ్రీ తనకు తను ఉపదేశించుకున్నట్లు అనిపిస్తుంది ఈ విలక్షణమైన కావ్యాన్ని పఠించినప్పుడు. రాధశ్రీకి భావపుష్టిగల పద్యాలే ఎదురౌతాయి. అప్పుడాయన మనస్సు రెక్కలు కట్టుకొని భావాంబర వీథుల్లో విహరిస్తుంది. అంతేకాదు, కల్గిన స్పందనతో పద్యానికి పద్యం రాస్తే గాని అతని మనస్సు ఊరుకోదు. తత్ఫలితమే ఈ "రాధశ్రీరత్న శతకం".

పద్యాన్ని పేరడీ చేసి చెప్పే కవులున్నారు మనకు. అది నిన్నటివరకు. కాని ఈ రోజు, మన ప్రాచీన కవుల పద్యాలలోని రామణీయకతకు ముగ్ధులమై మన అనుభూతుల్ని తిరిగి పద్యాల్లో చెప్పే సంప్రదాయం ఒకటి ఆవిర్భవించింది. దానికి ఆద్యుడు నాకు తెలిసినంతవరకు రాధశ్రీ కావచ్చు.

ఈ రోజుకూ పద్యం బ్రతికే ఉంది. అసలు కవిత్వం పద్యంలోనే బ్రతుకుతుందేమో. అవధానాల ద్వారా పద్యం తెలుగువారికి మరింత చేరువైంది. రాధశ్రీ అవధాని కాదు గాని, అవధానులు చూపే నేర్పు తన పద్యాల్లో చూపగలడు. కొత్తదనం లేకపోతే పాతవాళ్లు కూడా మెచ్చుకోరు. రాధశ్రీకి కొత్తదనం అంటే ఇష్టం. మణిప్రవాళ శైలిలో పద్యాలను రాసిన యువకవుల్లో సుందర రామకృష్ణుడున్నాడు. రాధశ్రీ కూడ మణిప్రవాళ శైలిలో అందంగా పద్యాన్ని రాయగలడు. "చెన్నప్ప శతకం"లాంటి రచనలందుకు ఉదాహరణ.

పద్యాన్ని చదివితే పాఠకుడౌతాడు. పాడితే గాయకుడౌతాడు. అర్థం చెబితే వ్యాఖ్యాత అవుతాడు. స్పందిస్తే భావుకుడౌతాడు. రాస్తే కవి అవుతాడు. రాధశ్రీలో భావుకత్వం ఎక్కువ. పాఠకునిలో ఉండే సుగుణంతో పాటు సహృదయునిలో ఉండే స్పందనతో పాటు కవిలో ఉండే భావనాశక్తి – రాధశ్రీలో ఉండడంవల్ల ఆవిర్భవించిందే ఈ "రాధశ్రీ రత్నశతకం".



ప్రాచీన, ఆధునిక కవుల అనర్ఘమణుల లాంటి పద్యాల సరసన రాధశ్రీ స్వకపోలకల్పిత పద్యాలను రత్నాలుగా ఉంచినాడు.

రాధశ్రీ పద్యాలన్నీ కందాల్లోనే అందాలు వెదజల్లుతున్నాయి. ఆయా కందాల్లో మొదటి రెండు పాదాలను విడిచి 3,4 పాదాలను (మకుటాన్ని విడిచి) గ్రహిస్తే ఆయా కవుల గొప్పతనం ఏమిటో స్పష్టమవుతుంది.

ఉదాహరణకు –

"శ్రీరామకృష్ణ సత్కవి
కారణజన్ముండు భువిని"

"విరిసిన పున్నమి వెన్నెల
కరణిని పోతన్న వ్రాసె"

"భూగోళముపై రసనిధి
కాగల దాశరథినిగను"

మరికొన్ని కందాలను పూర్తిగా పరిశీలిస్తే ఆయా కవుల ప్రసిద్ధమైన పద్యాల ఆధారంగా వారి ప్రతిభ గోచరమౌతుంది.

రాధశ్రీ ఒక మంచి పనిచేశాడు. ఏ పద్యం తనను స్పందింపజేసిందో ఆ పద్యాన్ని కూడా చూపడమే ఆ మంచిపని. దీని వల్ల పాఠకులకు ఎక్కడో మూలాన్ని వెదుక్కోవలసిన అవసరం లేకుండా పోయింది.

తెలుగులో అద్భుతమైన పద్యాలతో పాటు అందమైన పద్యాలు రాసిన కవులున్నారు. వారు ప్రాచీనులు కావచ్చు, ఆధునికులు కావచ్చు. రాధశ్రీ వారి పద్యాలను యథాతథంగా గ్రహించి స్పందించాడు.

ఈ కావ్యంవల్ల రాధశ్రీ మనస్సును దోచుకొన్న పద్యాలేవో, తన గుండెలో అతడు భద్రంగా దాచుకొన్న పద్యాలేవో మనకు అవగతమవుతాయి. ఇదొక సంకలన గ్రంథం. సృజనానుశీలనలు రెండూ ఒకే చోట భాసించే అపూర్వ సంగమమే ఈ గ్రంథం. నిజానికి రాధశ్రీ నూరు పద్యాలను గ్రహించి తన నూరు పద్యాలను వాటికి చేర్చాడు. అప్పుడు రెండు వందల పద్యాలవుతాయి. కాని రత్నశతకం అన్నాడు. బహుశా ఆ రత్నాలు ఆయా కవులవనే రాధశ్రీ అభిప్రాయం కావచ్చు. కాని నాకు మాత్రం ఆయా కవుల పద్యాలు మణులైతే రాధశ్రీ పద్యాలు రత్నాలు!

రాధశ్రీ పద్యాలు మకుటంతో మనోజ్ఞంగా భాసిస్తున్నాయి. మకుటం ఉండడం వల్ల ఈ కృతి శతకం అయింది. ఈ మధ్యకాలంలో రాధశ్రీ రాసినన్ని శతకాలు ఇంకెవరూ రాయలేదు. మట్టపల్లి లక్ష్మీనృసింహ శతకం, శశిమౌళి శతకం రాధశ్రీకి మంచి పేరు తెచ్చిపెట్టాయి.

రాధశ్రీ అవిచ్ఛిన్నంగా తెలుగు పద్యయాగాన్ని నడిపిస్తున్న కవి. అతని కవితా యజ్ఞానికి సహృదయులెల్లరూ ఆహూతులే. నా మీద ఎందుకో అతనికి కొంచెం ఎక్కువ అభిమానం. చాలా కాలం నుండి నేను అతని ప్రతిభను ప్రత్యక్షంగా ప్రత్యక్షరంగా దర్శిస్తున్నవాణ్ణి, హర్షిస్తున్నవాణ్ణి.

డా॥ రాధశ్రీ కృషిని అభినందిస్తూ అతడింకా మనోజ్ఞమైన, మహోన్నతమైన రచనలు చేయాలని ఆకాంక్షిస్తున్నాను.

*రాధశ్రీ "రత్న శతకం" పుస్తకానికి*

***15 - 3 - 2005***



# వాస్తవకవి

కవి కల్పనాత్మక జగత్తులో విహరించేవాడు కాదు, అతనికి ఒక సామాజిక బాధ్యత ఉంది అని 'కలికాలం' నిరూపిస్తుంది. ఈ కృతిలోని వస్తువు వాస్తవికమైంది. దాన్ని శ్రుతిజేసి శ్రోతలకు మనం పాటరూపంలో వినిపించినప్పుడే కవి మిత్రులు శ్రీ యలుగూరి వెంకటరెడ్డి గారి శ్రమ సార్థకమవుతుంది. గ్రామీణ వాతావరణంలో పుట్టి పెరిగినవారికీ ఆ వాతావరణంలో ఉద్యోగం చేస్తున్న వారికీ సమాజాన్ని పట్టిపీడిస్తున్న సమస్యల మీద ఎంతటి అవగాహన ఉంటుందో 'కలికాలం' చదివినప్పుడు మనకర్థమవుతుంది. 'కలికాలం'లో గ్రహింపబడిన వస్తువు వర్తమానానికి, మానవ మనుగడకు సంబంధించింది.

వాతావరణ కాలుష్యం ప్రపంచాన్ని మొత్తాన్ని బాధిస్తున్న సమస్య కనుకనే సమస్యలన్నిటిలో దానికిగల ప్రాధాన్యాన్ని బట్టి కృతిలో ప్రథమ శీర్షికగా దాన్ని కవి గ్రహించాడు. నగరాలకు దూరంగా, పల్లె వాతావరణంలో ఉంటున్న వారిని ప్రశాంతమైన ఆ వాతావరణం కూడా కరవవుతుందేమోనన్న భయం అనుక్షణం పీడిస్తుంది.

తెల్లవారక ముందే నీళ్లను పాలరూపంలో మన ముఖాన పోసిపోవడం రోజు చూస్తున్నదే. పాలే కాదు, పాలల్లో కలిపే నీళ్లు కూడా కల్తీ కావడం కవికి మరింత బాధను కల్గించింది. గాలి, నీరు, ఆహారం సమస్తం కల్తీ అయినప్పుడు మానవునికి ప్రశాంతి ఎక్కడ?

'ఇసుమంత విజ్ఞానం' అనే కవితాఖండికలో కవి నేటి విద్యాసంస్థల పనితీరును తూర్పారబట్టారు. గురుకులాలు కురుకులాలైన విషయాన్ని బట్టబయలు చేశారు. పదునాల్గు శీర్షికలలో విస్తరించిన 'కలికాలం' ప్రతి అక్షరంలోనూ ప్రతిఫలించింది. ఈ కృతి ప్రత్యేకత ఏమంటే ఇది మొదటి నుంచి చివరి వరకు విడవకుండా మన చేత చదివించే రచన.

అసలే వ్యావహారిక భాష. ఛందస్సు ద్విపద. స్పందనకు నెలవైన హృదయం. లక్ష్యశుద్ధి - ఇవన్నీ కలిసి రెడ్డిగారిని కవిని చేశాయి.

కలం పట్టగానే యతులూ, ప్రాసలూ తమంతతామే వచ్చాయి తప్ప కవి కావాలని వాటికోసం యత్నించినట్లు కనిపించదు. అక్కడక్కడ వ్యాకరణానికి

తలవంపులు కలిగినా వస్తువర్ణనకు మాత్రం అందమైన వంపులు, సొంపులు సమకూరాయి.

ప్రకృతి వికృతి కావడ[illegible]రవస్థను కవి

"నూరేండ్ల జీవికి నూకలు చెల్లు.

ఆరేండ్ల పసివాడు అద్దాలు కోరు" అని వ్యంగ్య చిత్రణ చేశారు.

అధికారమున్నట్టి అగ్రనాయకులు పదవులు పేదలకు పంచరెందుకు? అని పేదల పట్ల మొసలి కన్నీరు కార్చే వాళ్లను నిలదీశారు. అన్ని రంగాలతో పాటు సినిమా రంగం కూడా కవి హృదయాన్ని కలిచివేసింది. నేటి అశ్లీల నృత్యాలను గూర్చి వారిలా అన్నారు.

"బ్రేకు డ్యాన్సిదియంటు బెదురు లేకుండ

తోకగోసిన కుక్క దొర్లాడినట్లు

తిక్కలేచిన గొర్రె తలద్రిప్పు విధము

ప్రక్కలెగిరేయుచు పరుగిడిన చాలు"

ఈ కృతిలోని అన్ని శీర్షికలు ఒక యెత్తు, పదకొండవ శీర్షిక 'గృహం-గ్రహపీడలు' ఒక యెత్తు. లోకంలో వాస్తు చెప్పిన వాడు బాగానే ఉంటాడు. కాని, ఇల్లు కూలగొట్టుకున్నవాడే ఇబ్బందుల పాలవుతాడు. నేడు మనకు పట్టింది గ్రహపీడ కాదు, గృహపీడ. అందుకే కవి, విధివ్రాలు మారునా వీధి మారినను? అని మందలించాడు.

శ్రీ వెంకటరెడ్డిగారు వాస్తవ కవే గాని వాస్తుకవి కాదు. ఒకవేళ వారు వాస్తుకవే అయితే ఈ కృతిని శ్రీకారంతో మొదలుపెట్టేవారు!

శ్రీ యలుగూరి వెంకటరెడ్డిగారు ఎంత భావావేశం కల్గిన కవులో అంత ఆలోచనాపరులు. వారిలో మంచి అధ్యాపకుడే కాదు మంచి వక్తృత్వం కల్గిన మనీషి ఉన్నాడు. అంతకంటే మంచి సామాజికుడున్నాడు. కనుకనే కేవలం కవిత్వాన్ని కవిత్వం అనిపించుకోవడం కోసం కాక దాని పరమలక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకొని, కలికాలపు కలుపు మొక్కలను ఏరివేస్తూ మన దృక్పథాలను అభ్యుదయ పథంవైపు మళ్లిస్తున్నందుకు నేను వారిని మనసారా అభినందిస్తూ... ఇంత మంచి కృతిని సాంస్కృతిక సాహితీ సమాఖ్య, దేవరకొండ పక్షాన అందిస్తున్నందుకు సంపాదకులు శ్రీ వనం చంద్రమౌళిగారికి నా శుభాభినందనలు తెలుపుతున్నాను.

యలుగూరి వెంకటరెడ్డి 'కలికాలం' ద్విపద కావ్యానికి

*- 1997*



# వ్యాఖ్యానశిల్పి

భక్తి, జ్ఞాన, వైరాగ్య సంపన్నురాలు, ప్రతిభావ్యుత్పత్త్యభ్యాస పారీణురాలు, పరమేశ్వరానుగ్రహపాత్రురాలు ఐన స్వరాజ్యలక్ష్మిగారు శ్రీకృష్ణామృత శ్రీరామ కర్ణామృత వ్యాఖ్యానాల అనంతరం శివకర్ణామృత వ్యాఖ్యానానికి ఆయత్తం కావడం సముదాత్తమనక తప్పదు.

స్వరాజ్యలక్ష్మిగారు స్వగృహాన్ని వేణుధరుని సన్నిధానంగా మార్చి ఎప్పటికప్పుడు కన్నయ్యకు కవితాకలువల హారాలు సమర్పిస్తూనే, శివకేశవాభేదానికి ఆలంబనగా శివకర్ణామృత వ్యాఖ్యను పూర్తి చేశారు. పరమాత్మ తత్వాన్ని ఆకళింపు చేసుకున్న ఈ విదుషీమణికి ఏ నామమైనా ఒక్కటే. రాముడైనా, కృష్ణుడైనా, శివుడైనా, కేశవుడైనా భక్తిసాగరంలో ఓలలాడేవారికి ఎవరైనా ఒక్కటే.

భవసాగరం నుంచి బయటపడడానికి భక్తిని తెప్పగా చేసుకొన్న భక్త కవయిత్రి స్వరాజ్యలక్ష్మిగారు.

ఏ రచనైనా పరమార్థాభిముఖంగా వెళ్లినప్పుడే ఆ రచనకు సార్థక్యం. జీవితంలో ఎన్నో ఆటుపోట్లకు ఎదురునిల్చి విజేతగా నిల్చిన స్వరాజ్యలక్ష్మిగారికి రచనావ్యాసంగం గొప్ప తృప్తినిచ్చింది. వారి కవిత్వం మీద నా పర్యవేక్షణలో ఉస్మానియా యూనివర్శిటీలో ఎమ్.ఫిల్ డిగ్రీరావడం వారికేకాదు, నాకూ ఎంతో ఆనందాన్నిచ్చింది.

అనువాదం స్వేచ్ఛానువాదమని, మూలవిధేయానువాదమని రెండురకాలు. స్వరాజ్యలక్ష్మిగారివి కేవలానువాదాలుకావు. అచ్చమైన సుమధుర వ్యాఖ్యానాలు.

భక్తి భరితమైన శ్లోకంగాని, పద్యంగాని వారిచెవిలోబడితేచాలు, మేఘగర్జనకు పరవశించి పురివిప్పి నాట్యంచేసే మయూరంలా మారుతుంది వారి మనస్సు. ఇంకేం! వ్యాఖ్యాన రసామృతం వారి కలం నుంచి జాలువారుతుంది. ముచ్చటగా మూడు గ్రంథాలు వ్యాఖ్యానింపబడటంవల్ల వారి వ్యక్తిత్వం త్రివేణీసంగమానికి ప్రతీకగా మారింది.

ఇక శివకర్ణామృతం గురించి ముచ్చటించుకుందాం. స్వరాజ్యలక్ష్మిగారి పండిత హృదయం వ్యాఖ్యాన సందర్భంలో భగవద్గీత, భాగవతాది భక్తిరస స్రోతస్విసులను స్పృశించింది. ఆమెకుగల విద్యా పరిశ్రమకు ఇదొక ఉదాహరణ.

వ్యాఖ్యానం అనగానే ఎవరు? దేన్ని? ఏవిధంగా? ఎందుకు చేస్తున్నారన్న ప్రశ్నలు ఉద్భవిస్తాయి. వీటన్నింటికి చక్కని సమాధానమే శివకర్ణామృత వ్యాఖ్య. రచయిత్రి పరమభక్తురాలు. గ్రంథం భక్తరసభరితమైంది. శైలి సరళసుబోధకమైంది. లక్ష్యం భవబంధాలనుంచి బయటపడటం.

ఒక భాష నుంచి మరో భాషలోకి అనువదించడం ఎప్పుడూ కష్టమైన పనే. మూలభాషతోపాటు స్వీకృత భాషలో మంచి పాండిత్యం ఉన్నప్పుడే ఆకష్టమైనపని ఇష్టమైన పనిగా మారుతుంది. అందుకు శివకర్ణామృత వ్యాఖ్యలోని ప్రతిపంక్తి చక్కని ఉదాహరణ.

"లలాటలోచన పురస్స్ఫురణాతిరిక్తం" అనేదానికి "ముక్కంటి మూడవనేత్రం అరుణమైంది" అనేది స్వరాజ్యలక్ష్మిగారి అనువాదం. ప్రథమాధ్యాయంలోని 7వ శ్లోకానికి వారు చేసిన వ్యాఖ్యానాన్ని చూడండి.

"ముక్కంటి మూడవ నేత్రం అరుణమైంది...జ్ఞానదీధితులచే వెలుగొందుననట్లు చేయుమని వేడుకొందము."

ఇదే గాక ఏ శ్లోకానికి వారు రాసిన వ్యాఖ్యను గమనించినా, అది అన్ని రుచులకు ఆలవాలమైన విందుభోజనంలా ఉంటుంది. మొగ్గగా ఉన్న మూలశ్లోకాన్ని తన శేముషీ కిరణస్పర్శచే పువ్వులా విప్పారే విధంగా మార్చే ప్రజ్ఞ స్వరాజ్యలక్ష్మిగారిది. ధాటిగా మాట్లాడటమే గాక, ధాటిగా రచన చేయగల ధీశాలి వారు. వారి వ్యాఖ్యానం ఒక రసప్రవాహంలా భాసిస్తుంది. అందుకు కారణం వారి మనస్సు నిరంతరం భక్తిరసంలో మునకలు వేయడమే.

శివభక్తాగ్రేసరులకు నిత్యపారాయణ గ్రంథమైన శివకర్ణామృతాన్ని సమస్త జనులకు ఇష్టపాత్రంగా వ్యాఖ్యానించి తన జన్మను పునీతం చేసుకున్నారు స్వరాజ్యలక్ష్మిగారు. వారిని ఈ సందర్భంలో హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

సాహిత్యచరిత్రలోని వ్యాఖ్యాన పరంపరలో వారి ఈ కర్ణామృత త్రయం సర్వజనామోదాన్ని పొందాలని ఆశిస్తున్నాను.

**సిహెచ్. స్వరాజ్యలక్ష్మి 'శ్రీ శివకర్ణామృత వ్యాఖ్య' పుస్తకానికి**

***30-6-2004***



# ముందుమాట

మిత్రులు శ్రీ తల్లోజు యాదవాచార్యులు నాకు వారి అష్టావధాన కార్యక్రమంలో పరిచయమయ్యారు. విద్యతో పాటు వినయం రూపుదాల్చిన శ్రీ యాదవాచార్యులకు ఆశుకవిత అంటే ఎంతో ప్రేమ. పండిత కుటుంబంలో జన్మించకపోయినా, వ్యాకరణాది శాస్త్రగ్రంథాలు పరిశీలించకపోయినా, ఆయనకు మాత్రం సహజంగా కవిత్వం అంటే ఎంతో మమకారం ఏర్పడింది. ఆ కారణంగానే తాను ఏ దృశ్యాన్ని చూసినా, ఎవరైనా కొత్తవారు పలకరించినా పులకరించిపోతారు. పూలలా ఆశుకవితా బాణాలను సంధిస్తారు. వారు రచించిన 'తల్లోజు పద్యమంజరి' ఒక విలక్షణమైన కవితాసుందరి. 'తుఫాను' మొదలుకొని 'కుటుంబ సంక్షేమం' దాకా, 'వృక్షవిలాపం' మొదలుకొని 'పక్షి సందేశం' దాకా ఎన్నో అంశాలు పద్యాలలో హృద్యంగా అలంకరించబడినాయి.

ఏ కవితను పరిశీలించినా మానవత అంతటా తీగలా అల్లుకొనడం విశేషం. 'వృక్షవిలాపం'లోని పంక్తులు చూడండి –

"ఆదినుండి గూడ నౌషధ నిధినగుచు
నీడనిచ్చి చివర తోడు నడచి
మానవోత్తమునకు మంచి గూర్చుటలేదె
స్వార్థపరుడు నరుడు చంపుటేల"

వృక్షం మన స్వార్థాన్ని ఎత్తిచూపి గొప్ప సందేశాన్ని ఇస్తుంది! 'చివర తోడు నడచి" అన్న మాటలు శరీరం కట్టెగా మారి కట్టెలతో కాలిపోవడాన్ని గుర్తుకు తెస్తున్నవి.

ఇట్లే 'పక్షి సందేశం' ముత్యాలసరాలలో అక్షరాకృతి దాల్చింది. నేటి కాలంలో ఆశుకవికి పద్యంతో పాటు గేయం కూడా ఇష్టమేనన్న విషయాన్ని ఈ ఖండిక నిరూపిస్తున్నది. పద్యాన్ని గాని గేయాన్ని గాని వేగంగా పరిగెత్తించడం ఆశుకవులకే చెల్లు. ఐతే అక్కడక్కడ ఏవైనా కొన్ని ఇబ్బందులు కూడా ఏర్పడవచ్చు. అవి భాషా సంబంధమైనవే తప్ప భావసంబంధి కావు. 'గింజ ధాన్యము'లాంటి శబ్ద ప్రయోగాలు అందుకు ఉదాహరణగా చూపవచ్చు.

తల్లోజు మంచి భావుకుడు. ఆయన కవిత్వంలో సూక్తి నిధిత్వం మెండు. అందుకు 'గురువు లేక యున్న గుడ్డిదౌ లోకమ్ము', 'మాట నిలుపువాడు మనుజుడు', 'పట్టిచూడ ప్రతిది పైపైని నురుగయే' వంటి సూక్తులను ఉదాహరించవచ్చు. రోజు రోజుకు సన్నగిల్లుతున్న సాంస్కృతిక విలువలను గూర్చి కవి ఎంతో వాపోయాడు.

"మమ్మీడాడీయను మాట రూలుగ మారె
కట్టుబొట్టులు జారె, బెట్టు పారె"

దేశానికి స్వేచ్ఛ లభించిందనే కాని మనమీనాడు మన వేద సంస్కృతికి దూరమయ్యాం. మన భాషకు దూరమయ్యాం. అన్నింటా ఆంగ్లేయుల ముద్ర కనిపిస్తుంది. పాశ్చాత్య నాగరికత అనే ముసుగు ధరించి నిద్రపోతున్న జాతిని మేల్కొల్పడానికి దయానందుని వంటి మహాపురుషుని ఆగమనం తప్పదేమో!

చరిత్రకందని కాలంనాటి మన సాంస్కృతిక చరిత్రను విస్మరించి పరాయి పాలకుల కిరాయి రాతలనే చరిత్రగా తలకెక్కించుకున్న కుహనా మేధావుల కుట్రలను భగ్నం చేయగలిగిన వ్యవస్థను ఇకనైనా ఆహ్వానిద్దాం, అందుకు ప్రయత్నిద్దాం.

తల్లోజు లాంటివారు విద్యాలయాల్లో అధ్యాపకులుగా ఉండి విద్యార్థులను ధీరులుగా, వీరులుగా మార్చడమే గాక, ఇలాంటి పద్యాల ద్వారా ఉత్సాహాన్ని కల్గిస్తున్నందుకు అభినందిస్తున్నాను.

శ్రీ తల్లోజువారు తమ కలానికి ఎప్పటికప్పుడు పదును పెట్టి, శబ్ద సౌందర్యాన్ని, వ్యంగ్య వైభవాన్ని సంపూర్ణంగా ఆవిష్కరిస్తూ మరిన్ని కవితలతో తెలుగు భారతిని అలంకరిస్తారని ఆశిస్తూ, కృతి స్వీకర్త శ్రీ ఎ. రాజయ్యగారికి శుభాకాంక్షలు అర్పించుకొంటున్నాను.

తల్లోజు యాదవాచార్యులు 'తల్లోజు పద్యమంజరి' పుస్తకానికి

*4-12-98*



# అద్భుత గేయ కావ్యం

గోల్కొండ సామ్రాజ్యాన్ని పరిపాలించిన అబ్దుల్లా కుతుబ్‌షా వారి దర్బార్‌లో తారామతి ఆస్థానగాయని, ప్రేమావతి ఆస్థాననర్తకి. వీరికై ప్రత్యేకంగా నిర్మించబడిన భవనాలు ఆనాటి తీపిగుర్తులుగా నిలిచి ఉన్నాయి. వీరి పేర్ల మీదుగా వెలిసిన తారామతి పేట, ప్రేమావతిపేట గ్రామాలు వారి అద్భుత కళాజీవనాన్ని చాటుతాయి. ఈ చారిత్రక ఇతివృత్తాన్ని భరత కళాప్రపూర్ణులైన డా॥ నటరాజ రామకృష్ణగారి ప్రేరణతో డా॥ రాధశ్రీ గేయకావ్యంగా మలిచాడు.

గానంతో తారామతి, నాట్యంతో ప్రేమావతి రసికలోకాన్ని మురిపించిన చారిత్రకేతివృత్తాన్ని గేయకావ్యంగా రాయాలన్న కోరిక ఏ శుభముహూర్తంలో కలిగిందో కాని ఆ కోరిక చరితార్థమైంది. డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ ఆచార్య తిరుమల, డా॥ నాగభైరవ, డా॥ నటరాజ రామకృష్ణ వంటి కవుల ప్రశంసలకు పాత్రమైన విద్వన్మణి డా॥ రాధశ్రీ. పద్యరచనాకుశలుడైన కవి గేయాన్ని నడిపిస్తే ఎలా ఉంటుందో దర్శించడానికి ఈ కావ్యం చక్కని ఉదాహరణ. చెన్నప్ప శతకం ద్వారా శతకకవుల సరసన చేరి, కవితా కృష్ణవేణి ద్వారా వచనకవుల ప్రక్కన చేరి, 'ఆర్య చాణక్య' ద్వారా నాటక రచయితగా పేరుపొంది, ఇప్పుడు తారామతి, ప్రేమావతి గాథను నవరస భరితంగా గేయకావ్యంగా చిత్రించాడు.

రాధశ్రీ భావనాశక్తి అమేయమైంది. అసామాన్యులైన కళాకారిణుల జీవిత చరిత్రను అనల్ప కళాఖండంగా తీర్చిదిద్దగలిగిన నేర్పు అతనిది. ఈ కావ్యాన్ని చదువుతుంటే పదహారణాల ఆధునిక కావ్యాన్ని చదువుతున్న అనుభూతి కలుగుతుంది. ఛందస్సులోను, ఇతివృత్తంలోను, సన్నివేశ చిత్రణలోనూ, రసనిర్వహణలోనూ రాధశ్రీ ప్రదర్శించిన తీరు ఎవరినైనా ఆశ్చర్య చకితుల్ని చేస్తుంది.

"లోకమ్మునే మరచి, నాకమును దర్శించి
గోల్కొండ పురజనులు కుందనపు బొమ్మలై"......

ఎందుకు నిలిచారో తెలుసుకోవాలంటే రాధాశ్రీలోని ధారాశ్రీకి ఉదాహరణగా నిలిచే ఈ కావ్యం చదవాల్సిందే. ప్రముఖ చరిత్ర పరిశోధకులు శ్రీ బి.యన్. శాస్త్రిగారికి

అత్యంత ప్రీతిపాత్రుడైన నా ఆత్మీయ కవితామూర్తి డా॥ రాధశ్రీకి ఎంతో కీర్తి తెచ్చి పెట్టిన ఈ కావ్యం మత సామరస్యానికి, స్త్రీవాదానికి, కళాభిజ్ఞతకు, చారిత్రక, కాల్పనిక సరస సమ్మేళనానికి ప్రతీక. ప్రధానంగా కావ్యం గేయంలో నడచినా పద్య, గేయ, వచన కవితాత్మక త్రిపథగా మరో ప్రత్యేకత సంతరించుకున్నదీ రచన.

ఏ కళైనా విశ్వజనీనమైనప్పుడే దానికి సార్థక్యం కలుగుతుందన్న సందేశాన్ని అందిస్తుందీ కావ్యం.

"కష్టజీవుల కొరకె కళలు భాసించుటకు
తన వంతు కృషిని సంతసముతోనొనరించె"...........

అని పాదుషా గురించి చెప్పబడిన మాటలు కళా పోషకులందరూ గుర్తుంచుకోదగ్గవి. తారామతి, ప్రేమావతి తమ సంగీత నృత్య కళలతో కళాసేవ చేస్తూ, అవివాహితలుగా, శారదారాధనలో జీవితాన్ని గడపాలని నిశ్చయించుకున్నారు. ఈ నిశ్చయాన్ని ఏ విధంగా అమలుపరిచారో డా॥ రాధశ్రీ అపూర్వంగా చిత్రించారు. శృంగార పదరచనలో మేటియైన క్షేత్రయ్య చేతనే తారామతి, ప్రేమావతి ప్రశంసింపబడడం అద్భుతం.

"దేహమెప్పుడు ప్రాణదీపమున్నప్పుడే తేజరిల్లుచునుండు", "చెక్కు చెదరనిదొక్క చిర యశఃకాయమే", "భావమొక్కటె చిరంజీవియై మనగలుగు" వంటి నిత్యసత్యాలు సందర్భానుసారంగా ఈ కావ్యంలో దర్శనమిస్తుంటాయి. అద్భుత కళాకారిణులైన తారామతి, ప్రేమావతి ఆచంద్రతారార్కం తెలుగువారి నాలుకలపై నిలిచిపోయే లాగ రచించిన డా॥ రాధశ్రీని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

*డా॥ రాధశ్రీ 'తారామతి - ప్రేమావతి' పుస్తకానికి*

***1 - 5 -2001***



# "పదునైన శబ్దం, పదిలమైన భావం"

మిత్రులు డా॥ జనువాడ రామస్వామిగారి కవితా చైతన్యం అబ్బురం గొల్పుతుంది. ఆయనకు నాకంటె లోకానుభవం కాస్త ఎక్కువే అనిపిస్తుంది. ఆధ్యాత్మిక రచనలతో నేను కాలం గడుపుతుంటే సామాజిక స్పృహగల రచనలతో ఆయన ప్రయాణం చేస్తున్నాడు.

ప్రొద్దున్నే దినపత్రికను తిరిగేయని వారు అరుదుగా ఉంటారు. ఐతే వారికి కలిగే అనుభూతి ఎలాంటిదో వారి మాటల్లోనే విందాము.

"ఉదయం కాగానే - దినపత్రిక అద్దంలో
నా దేశ స్వరూపం - భయం భయంతో చూస్తాను"

నిజాలను బయటపెడుతున్న పత్రికలు మేధావులనే కాక సామాన్యులను సైతం దేశ భవిష్యత్తును గూర్చి ఆందోళన కలిగించడం అనుభవంలోని విషయమనక తప్పదు.

దేశానికి యువతను వెన్నెముకతో పోలుస్తారు. ఐతే ఆ వెన్నెముక కేవలం "వానపాము" (ఆకారంలో అలాగే ఉంటుంది) కారాదని చెబుతూ వజ్రాయుధంగా మారాలంటాడు జనువాడ. ఇంద్రుడు వృత్రాసురుని సంహరించడానికి దధీచి వెన్నెముకను వజ్రాయుధంగా చేసుకొన్న కథను ఈ సందర్భంలో మనం గుర్తు చేసుకోవాలి.

సృష్టి ఒకటి, దృష్టి వేరు అని అనుభవజ్ఞులు చెబుతారు. జనువాడ ఇలా అంటాడు -

"ఏ పెన్నైనా ఒక్కటే - వ్రాసేవాడికి
ఏ కన్నైనా ఒక్కటే - చూసేవాడికి"

రాసే ఉక్తి, చూసే శక్తి ముఖ్యమని వేరే చెప్పనవసరం లేదు.

మనం చెడ్డవాళ్లను చెడ్డవాళ్లుగా పేర్కొంటాం. దాన్ని ఎవరూ కాదనలేరు. ఐతే అలా అనే మనం కూడా చెడ్డవాళ్లమైతే ఎట్లా? అంటాడు జనువాడ.

"ప్రపంచపుటద్దంలో
నీ ముఖం చూసుకో
సద్దాం ప్రతిబింబంలా కనిపిస్తావు"

కవి అంతర్జాతీయ విషయ పరిజ్ఞానానికి ఈ పంక్తులు నిదర్శనం.

మనిషిని జ్ఞానం లేని కుక్క కరిస్తే కోప్పడుతాం, కాకి రెట్ట వేస్తే తిడతాం. తేలు, పాము కాటువేస్తే నానా హంగామా చేస్తాం. కాని మనకు తోటి వారిని దోచుకోరాదు, మోసం చేయరాదు, గాయపరచరాదు అన్న జ్ఞానం లేకపోతే ఎట్లా? జనువాడ ఏమంటాడో వినండి –

"దొరికిన వాడు స్కాంలీడర్
దొరకనివాడు స్కాం మెంబర్"

రెండు పంక్తుల్లో నేటి సమాజాన్ని ప్రతిబింబించాడు కవి.

హాస్యం, వ్యంగ్యం జనువాడ కవితకు రెండు కళ్లు. చూడండి –

"ఎన్నికల ముందు
జనులు గణపతులు"
(స్తోత్రాలు, నైవేద్యాలు అందుకుంటారు కనుక)

"ఆ తర్వాత నాయకులు
గజపతులు"

గజపతులంటే సేనాధిపతులని, రాజులని అర్థం చెప్పుకోవచ్చు. 'గజపతు'లనే కవితలో చివరి పంక్తులను గమనిస్తే జనువాడ సమయస్ఫూర్తి తేటతెల్లమవుతుంది.

"గణనాథుని హుస్సేన్‌సాగర్‌లో ముంచినట్లు
జనులను సమస్యల సముద్రంలో ముంచేస్తారు"

విషయజ్ఞుడైన కవి కనుక జనువాడ లోకానుభవాన్ని తెల్లియబరిచాడు.

ఇట్లా చెప్పుకుంటూపోతే జనువాడ 'వేకువరేఖలు' కవితాసంపుటి కంటె నా అభిప్రాయమే పెద్దది కావచ్చు. జనువాడ తన కవితల్ని పదునైన శబ్దంతో, పదిలమైన భావంతో పది కాలాల పాటుండే శైలిలో రచించి సహృదయ పాఠకులను రంజిస్తూ ఉన్నాడని ఒక్క మాటలో చెబుతూ ముగిస్తున్నాను. హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

డా॥ జనువాడ రామస్వామి 'వేకువరేఖలు' కవిత్వపుస్తకానికి
27 – 1 – 2005



# "చంద్రశేఖర్‌గారి అనుబంధాలు చెరిగిపోని సుగంధాలు"

"సృష్టిస్థితిలయలు భగవంతుని విన్యాసాలు" అంటూ "కిరణాలు" మరియు "భగవంతున్ని ప్రార్థించి సాన్నిధ్యం పొందవచ్చు" అంటూ "కుసుమాలు" కవిశేఖరులైన పి. చంద్రశేఖర్‌గారి కలం నుండి జాలువార్చాయి. అదే ఎత్తుగడను మరో కవితాసంపుటి "అనుబంధాలు"లో కొనసాగించడం కవి పారమార్థిక చింతనకు అద్దం పడుతుంది.

"ప్రతి కోరికా ఆకలే" అంటూ 'అమ్మ ఒడిలో' ఆకలికి కొత్త నిర్వచనం చెప్పి, "అమితమైనది మితంలో ఉంది" అంటూ తోరణాలులో ప్రపంచ మూలతత్వాన్ని ఆవిష్కరించి, "జీవితంలో భయంకరమైంది ఆనందం" అంటూ కిరణాలులో బ్రతుకు సారాన్ని వివరించి కవిత్వంలో తాత్వికతను, మానవతను, సౌశీల్యతను ముప్పేటలుగా మనకందిస్తున్న శ్రీ చంద్రశేఖర్‌గారు ఇప్పుడు మన చుట్టూ ఉన్న ప్రపంచంతో మనకున్న అనుబంధాలను కవితారూపంలో అభివ్యక్తం చేస్తున్నారు.

'అనుబంధాలు' కవితాసంకలనం శ్రీ చంద్రశేఖర్‌గారి నిర్విరామ కవితా పరిశ్రమకూ తాత్విక చింతనకూ అద్దం పడుతుంది. దీనిలో 24 ఖండికలున్నాయి. ఏ ఖండిక చూసినా కవిగా ఎదుగుదల, చుట్టూ ఉన్న సమాజంతో వారికున్న అనుబంధం, స్పందన తేటతెల్లమవుతాయి. ఇంతకాలం కవిగా ఒదిగి ఉన్నట్లు కనిపించే చంద్రశేఖర్‌గారు ఇప్పుడు ఎంతో ఎత్తుకు ఎదిగారు కవిత్వంలో.

'ధనం' అనే ఖండికలో

"నేను ధనాన్ని – నేనే జగాన్ని
నాకు తల్లి లేదు నాకు తండ్రి లేదు"

అనే పంక్తులు "ధనమూలమిదం జగత్" అనే పరమ సత్యంతో పాటు డబ్బు కారణంగా తల్లి, తండ్రి, అన్న, తమ్ముడు అనే అనుబంధాలకు మనమీనాడు ఎలా దూరమవుతున్నామో తెలియజేస్తున్నాయి. 'ధనం' విశ్వరూపాన్ని ఈ చిన్న కవితలో మనం దర్శించవచ్చు.

"నిలకడైన నిజం మీద
అబద్ధం పరదా కప్పుతుంది"

అన్న పంక్తులు చదివినప్పుడు "నివురు గప్పిన నిప్పు" జ్ఞప్తిలో నిలుస్తుంది. నివురు (బూడిద)ను తొలగిస్తే నిప్పు బయటపడుతుంది. పరదా తొలగిస్తే నిజం ఏమిటో తెలుస్తుంది. కనుకనే కవి "నిజం నిప్పులాంటిది, దాన్ని చేత్తో పట్టుకునే తెగింపు కావాలి" అంటారు. అక్షరాల్లో నిప్పులాంటి సత్యాన్ని ఆవిష్కరించిన కవి చిత్తశుద్ధి మెచ్చుకోదగింది.

కొందరిని బాల్యం ఆకాశంలో విహంగంలా ఎగిరేలా చేస్తే, మరికొందరిని పాతాళంలోకి తొక్కేస్తుంది అంటూ కవి 'బాల్యం' అనే ఖండికలో వెల్లడించిన భావాలు మనల్ని మన బాల్యంలోకి తీసుకొని వెళ్లడమే కాక, నేడు బాల్యావస్థలో ఉన్న బుడుతల జీవితాలను బాగుచేయాల్సిన తక్షణ కర్తవ్యాన్ని ప్రబోధిస్తాయి.

"కొందరికి బాల్యం ఒక వరం
కొందరికి బాల్యం ఒక శాపం"

జీవిత సత్యాన్ని గర్భీకరించుకున్న వాక్యిది. ఇలాంటిదే 'బ్రతుకు' ఖండిక. ఇది పూర్తిగా గ్రామీణ నేపథ్యంలో అవతరించింది. పాలమూరు నుండి భాగ్యనగరం, భాగ్యనగరం నుండి పాలమూరు వెళ్లే మార్గం కవితాహృదయం గల చంద్రశేఖర్‌గారి ఊహలకు రెక్కలు తొడిగింది!

"ఇసుకలో ముగ్గులు వేసే నీ చిరుచేతి వ్రేళ్లు
ఇనుపచట్రాల మధ్య నలిగిపోతున్నవా" అని పల్లెటూరి నిరుపేద అమ్మాయిలను సంబోధిస్తూ కవి మన గుండెల్ని కన్నీటితో బరువెక్కిస్తారు.

మనమంతా అభివృద్ధి పథంలో విహరిస్తున్నామని చెప్పే మాటల్లో నిజం లేదని కవి నిరూపించిన కవితే "శిథిల సమాజం". ఇందులో ప్రతి పంక్తి చంద్రశేఖర్‌గారి నిశిత సమాజానుశీలనాన్ని తెలుపుతుంది. మనకున్న స్నేహసంబంధాలు నేడు కాలుష్యానికి గురయ్యాయి మరి!

"కళకళ మెరిసేవి కన్నులయితే
జలజల రాలే కన్నీరేమిటి"

ఈ రెండు పంక్తులు చాలు చంద్రశేఖర్ అక్షరాలా పరిణతకవి అని చెప్పడానికి. సామాన్యులు మెరుస్తున్న కళ్ల గురించే చెప్పుకుంటారు. కాని, ఆ కళ్లలో దాగి ఉన్న కన్నీటి సముద్రాలను చూడలేరు. కష్టాలను స్వయంగా అనుభవించినప్పుడే ఇలాంటి కవిత్వం మొగ్గ తొడుగుతుంది!



చంద్రశేఖర్‌గారికి బాల్యం మీద ఎంత ప్రేమో, భాష మీద కూడ అంతే ప్రేమ. స్వభాష అయిన తెలుగును గూర్చి వారు చెప్పిన పంక్తులు మాతృభాషా ప్రియులకు శిరోధార్యాలు. మంత్రి అయినప్పటికీ మాతృభాషను మరువలేదు చంద్రశేఖర్‌గారు! పూలలోని సున్నితత్వంతో పాటు తియ్యదనాన్ని, సూర్యకాంతి (వేడి)తో పాటు చంద్రకాంతి (చల్లదనం)ని సంతరించుకొన్న తెలుగుభాషను వారు ఉదయకాలపు పచ్చిక మీది మంచుతో పోల్చారు. అంతటితో ఆగక జలపాతంతో పోల్చారు. చివరికి,

"ఏ భాష మాతృమూర్తి మమత వలె
మనస్సుకు అల్లుకుపోవునో
అదే నా భాష - తెలుగుభాష" అన్నారు.

చంద్రశేఖర్‌గారి కవిత్వంలో Nativity ఎక్కువ. మనిషి, మట్టి, సంస్కృతి మొదలైన వాటితో వారికి గల అనుబంధమే ఈ కావ్యంలో అడుగడుగున ప్రత్యక్షమవుతుంది. "ఏ భాషలో కలవలని వికసింపజేసే చంద్రుని కాంతి ఉన్నదో అదే నా భాష" అన్నప్పుడు వేడివేడి వాదాలు వాతావరణాన్ని వేడెక్కిస్తున్న ప్రస్తుత తరుణంలో శ్రీ చంద్రశేఖర్‌గారు మాతృభాషపై చంద్రకాంతులను ప్రసరింపజేస్తున్నారా? అనిపిస్తుంది. వారు నిజానికి చంద్రశేఖరులు గదా!

"దప్పుకొట్టి చెబుతున్నా
దబ్బున్న లేచి రావాలి"

అనే ఖండికలో కవి వెలిబుచ్చిన భావాలు కర్తవ్య ప్రబోధకాలు. మూఢాచారాల నుండి విముక్తి లభిస్తేనే సామాన్యుల జీవితాలకు సార్థకత!

మిత్రులు శ్రీ పి. చంద్రశేఖర్‌గారు వట్టి పుస్తకాలు చదివి కవిత్వం రాస్తున్నవారు కారు. కాలక్షేపానికి రాస్తున్నవారు అంతకంటే కారు. కవిత్వంలో నిబద్ధత గలవారు. సృజనశీలురైన వీరు ఎందరి బ్రతుకులనో ప్రత్యక్షంగా చూసి, బ్రతుకు పుస్తకాల్లోని ప్రతి వాక్యం గుర్తు పెట్టుకున్నారు. పన్నీటితో పాటు కన్నీటినీ కవితాబద్ధం చేసి తనకు తన చుట్టూ ఉన్న ప్రపంచంతో గల అనుబంధాన్ని తెలియజేశారు.

ఐదు కవితాసంకలనాలను అందించిన వారి కలం మరింత శక్తితో ముందుకు సాగి, ఇంకెన్నో కవితాసంకలనాలకు జన్మనిచ్చి వారిని మహాకవిగా తీర్చిదిద్దాలని ఆకాంక్షిస్తూ, హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

**పి. చంద్రశేఖర్ 'అనుబంధాలు' కవితాసంపుటికి**

***5 - 9 - 2001***

# హాస్య వ్యంగ్య ప్రసాద కవిత

"అధర్మం చలువరాతిపై అన్యాయం నాట్యమాడుతుంది"

మిత్రులు శ్రీ మంచాల ప్రసాద్‌గారు లోకం తీరును సున్నితంగా పరిశీలించి 'కన్నీటి నవ్వు'లో అన్న మాటలివి.

మంచాల ప్రసాద్‌గారు అడ్వొకేట్‌గా మొదట్లో నాకు పరిచయమయ్యారు. కాని ఆ తర్వాత కవిత్వం అంటే ఇష్టపడే వ్యక్తిగా, కవిగా నా హృదయానికి చేరువయ్యారు. "ఆ కవి అలవోకగా కవిత్వం రాస్తాడు" అనే మాటలు ప్రసాద్‌కు వర్తించవు. కవిత్వం వెనుక కొంత పరిశ్రమ ఉంటుంది. తన దృష్టికి అందిందంతా కవితా వస్తువు కాదు. వక్త, శ్రోతృ జీవన సౌందర్యాలను తాకుతూ విశ్వజనీన భావనను గర్భీకరించుకున్నదే అసలు సిసలైన కవితావస్తువు. ప్రసాద్ 'కన్నీటి నవ్వు'లోని ఏ కవితను పరిశీలించినా పై లక్షణం వర్తిస్తుంది.

"సెక్యులర్ బడిలో చదివాం
సేఫ్‌గా విదేశాలకెగిరాం
..............................
మాకు ఓ మాతృదేశం ఉంటే చాలు
దాని కోసం మేమేమీ చేయకున్నా"

స్వదేశంలో చదువుకొని విదేశాలకు వెళ్లే భారత పౌరులను గూర్చి వ్యంగ్యంగా రాసిన పంక్తులివి. ఈ పంక్తులను చదువుతున్నప్పుడు –

"అమ్మకు నేనేమీ పెట్టకున్నా అమ్మ అనే వొస్తువొకటుంటే చాలు" అని నాకనిపిస్తుంది! ప్రసాద్ కవితారచనలో చేయి దిరిగిన కవిగాక పోవచ్చు గాని, చైతన్యం గల కవి అని మాత్రం చెప్పగలను. ఆయన కవిత్వం అంతా ఒక ఎత్తు. కవితా శీర్షికలది ఒక యెత్తు.

"చెదలు పట్టిన బాంధవ్యాలు" అనే శీర్షికతో రాసిన నేటి కుటుంబ వ్యవస్థకు అద్దం పడుతుంది.



"రెక్కలొచ్చిన సుపుత్రులు
సొంత ఇండ్లను వెదుక్కుంటున్నారు"

ఇందులో ఎంత వ్యంగ్యం ఉందో జాగ్రత్తగా పరిశీలిస్తే తెలుస్తుంది.

నేటి ప్రపంచం ప్రకటనల మీదనే నడుస్తుంది అనటానికి వారి "ప్రకటనలు" చదవాల్సిందే.

"పాల డబ్బా కొనండి
పాపాయి ఉచితం"

ఆకర్షించడానికి నేటి వ్యాపార సంస్థలు అనుసరించే పద్ధతుల్ని వ్యంగ్యంగా ఎత్తి పొడవడం ఇందలి ప్రత్యేకత.

నేటి కాలంలో ఎవరి నోట విన్నా హైటెక్ మాట వినిపిస్తుంది. చందమామను చూపించినా మారాం చేయడం మానని పిల్లవాడు, చంద్రబాబు బొమ్మని చూపిస్తే అల్లరి మాని కేరింతలు కొట్టాడని చెప్పడం ప్రసాద్‌గారికే చెల్లింది.

"హైటెక్ చంద్రన్న" ఈ కవితా సంపుటికే హైలైట్.

'క్యూ' అనే కవిత మొత్తం వ్యవస్థను ప్రత్యక్షం చేస్తుంది. కవి అవగాహనాశక్తికి ఇదొక ఉదాహరణ.

"చేను లేకుండానే అధికారం
కంచెలా విస్తరించింది
కంచె ఉందని కాపలాదారుని కూడా
తొలగించారు" – 'చేను లేని కంచె'

ప్రభుత్వ బాధ్యతారహితమైన నిర్వాకాన్ని కవి హాస్యస్ఫోరకంగా వెల్లడించడం ఇందులోని విశేషం.

ప్రసాద్ కవిత్వం మామూలు కవుల కవిత్వాల కంటె విలక్షణమైంది. కవిత్వానికీ, కవుల వృత్తులకూ సంబంధం ఉంటుంది. ప్రసాద్‌గారు న్యాయవాది. సామాజిక న్యాయం, వ్యక్తిన్యాయం బాగా తెలిసినవారు. వారు సమాజంలోని వ్యత్యాసాలను, రుగ్మతలను బాగా గుర్తించారు. నిర్భయంగా వాటిని కవితాబద్ధం చేయడంలో న్యాయవాది అనిపించుకున్నారు.

"కాల చక్రానికి ఇరుసు ప్రకృతి
ఋతువులెన్నైనా కాలం ఒక్కటే" – "నేను మట్టి మనిషిని కాను"
వస్తుతత్వాన్ని సమగ్రంగా దర్శించిన కవిగా ప్రసాద్ కనిపిస్తారిక్కడ.
ఇదే కవితలో మరో చోట –
"దినం, మాసం, సంవత్సరం
అవి కేవలం కాలమనే చెట్టురాల్చే ఎండుటాకులు" అని అంటారు.

ఎంత బాగా చెప్పారు కాలం గురించి. ఈ కవిత కేవలం ఆలంకారికంగానే కాక ఆధ్యాత్మికంగాను విశిష్టమైంది.

ప్రసాద్ లాయర్‌గా అనుభవం ఉన్నవారు. నాతో కలిసినప్పుడు ఇద్దరం కవిత్వం గురించి మాట్లాడుకుంటాం. ఆయన ఒక సోదరునిలా నాతో మాట్లాడుతారు. ఇన్నాళ్లు నాకు మంచి మిత్రుడని నేను వారిని భావించాను. ఇప్పుడొక మంచికవిగా నేను వారిని చూస్తున్నాను. వారు నా కంటె వయసులో చిన్నవారు కనుక వారిని నేను మనఃపూర్వకంగా అభినందిస్తున్నాను.

ప్రసాద్ రచించిన ఈ 'కన్నీటి నవ్వు' కవితా ప్రపంచంలో ఒక ప్రత్యేకతను సంతరించుకోవాలని ఆశిస్తూ "(అ)సామాన్యుడు"లో వారే చెప్పిన

"వీడు సామాన్యుడు కాడు
నరనరాల్లో తరతరాల తిమిరాన్ని
ఛేదిస్తున్నాడు" అనే
కవితాపంక్తులతో ఈ పీఠికను ముగిస్తున్నాను.

*మంచాల ప్రసాద్ 'కన్నీటి నవ్వు' కవితా సంకలానికి*

***6 - 10 - 2001***



# "పద్యధారాశ్రీ"

కృష్ణానదీ తీరంలో నల్గొండ జిల్లాలోని మట్టపల్లిలో వెలసిన దైవం లక్ష్మీ నృసింహుడు. అట్టి దివ్యమూర్తిపై మా రాధశ్రీ తేటగీతులతో ఆపాతమధురమైన శైలిలో ఈ శతకాన్ని రచించడం ఎంతైనా ముదావహం. రాధశ్రీ పద్యధారా కుశలుడు. ఆయనది కామర్స్ ఐనా తెలుగులో చాలామంది కంటె మంచి ప్రవేశం ఉంది. 21వ శతాబ్దిలో శరవేగంతో రచనలు చేస్తున్న పద్యకవి రాధశ్రీ. ఆయన ఈ శతకానికి పెట్టిన మకుటం ఆయన ప్రతిభకు గీటురాయిగా ఉంది.

నృసింహుణ్ణి క్లేశహరునిగా భావించినాడు. యోగదర్శనంలో భగవంతుని స్వరూపం చక్కగా చెప్పబడింది. "క్లేశకర్మ విపాకాశయైరపరామృష్టః పురుష విశేష ఈశ్వరః" అని.

భగవంతునికి క్లేశాలుండవు కనుక ఆయన క్లేశహరుడని చెప్పవచ్చు.

రాధశ్రీ భక్తిభావమే కాక పద్యధార కూడ అకుంఠితమైంది.

ఉదాహరణకు ఈ పద్యాన్ని చూడండి.

"భావజాలము లేనట్టి పద్యమేల?
జీవకళ యుట్టిపడనట్టి శిల్పమేల?
జనక నీ చింత లేనట్టి జన్మమేల?
క్లేశహర! మట్టపల్లి లక్ష్మీనృసింహ!"

మొదటి రెండు పాదాలు పద్యధారను సూచిస్తే మూడవ పాదం వారి భక్తి ప్రపత్తులను తెలుపుతుంది.

కొత్తగా కవిత్వం రాస్తున్నవాళ్లున్నారు. కాని, కొత్తదనాన్ని మాత్రం కవిత్వంలో చూపడం లేదు. రాధశ్రీ ఉపమలు కొంగ్రొత్త రీతిలో ముస్తాబయ్యాయి.

"ఒక రైలు మార్గముగ నిస్పృహ సేయ
యోగి వరనుత! మనుజుండు 'బోగి' యగును"

దైవం రైలుబండి ఐతే జీవుడు బోగి - బోగి రైలు బండిలో భాగం. ఎన్ని బోగీలున్నా ఇంజన్ లేని రైలు వల్ల ప్రయోజనం లేదు. పరమాత్మ సర్వవ్యాపకుడు కాగా జీవుడు అందులోని వాడని మనకు రాధశ్రీ తెలుపుతున్నాడు. ఇది చక్కని ఉపమానం.

ఎంత ఆధునికులమని చెప్పుకొన్నా, వైజ్ఞానికంగా ఎంతో ఎదిగినామని ప్రచారం చేసుకొన్నా - ఒకటి మాత్రం నిజం - మనల్ని మన కులమతాలు వెక్కిరిస్తున్నాయి. మనుష్యులది అందరిది ఒకే జాతి కాని - కొందరనుకున్నట్లు మనుష్యులలో వేర్వేరు జాతుల్లేవు.

"ఆకృతి గ్రహణాత్ జాతిః"

ఆకారం చేత జాతి గ్రహింపబడుతుందని న్యాయదర్శనం చెబుతుంది. రాధశ్రీ పలికిన పలుకులు కొందరి చెవులకు ములుకులు కావచ్చు కాని అవి యథార్థం.

"మానవత్వము లేనట్టి మతమదేల?
కలిసి జీవింపనీయని కులమదేల?
కరుణ కనరాని జాత్యహంకారమేల?"

రాధశ్రీ మానవస్వభావాన్ని ఈ శతకంలో అద్భుతంగా చిత్రించాడు. తల్లిదండ్రులు చిన్న పిల్లలకు ముద్దుగా గోరుముద్దలు తినిపిస్తే వెంటనే తినరు. పైగా వద్దని మొండికేస్తారు. ఇది బాల్యంలో సాధారణంగా జరిగేది. ఇక పెద్దవారైన తర్వాత ఆ పిల్లలు తల్లిదండ్రుల ఆకలిని పట్టించుకోరు. ఓ ముద్ద పెడితే తమకా ముద్ద తక్కువవుతుందని భావిస్తారు. ఇదీ లోకపు పోకడ. ఐతే అలాంటి కొడుకులు లేనందుకు నాకే మాత్రం బాధలేదని రాధశ్రీ ఆత్మాశ్రయ రీతిలో రాసిన పద్యాన్ని గమనించండి.

"ముద్దు ముద్దుగ ముద్దను ముట్టననుచు
పెద్దవాడయ్యు ముద్దను పెట్టననుచు
నేడిపించెడి కొడుకుకై వేడ నిన్ను
క్లేశహర......................."

ఈశ్వరుని సర్వవ్యాపకత్వాన్ని కవి రాధశ్రీ చక్కగా గ్రహించాడనడానికి మరొక చక్కని ఉదాహరణ.



"వేదగిరిపైన చెలువొందు వేదమూర్తి!
యాదగిరిగుట్టపైనున్న యాదవేంద్ర!
పుష్పగిరిపైన భాసిల్లు పుణ్యరూప!
క్లేశహర! మట్టపల్లి లక్ష్మీనృసింహ!"

నాకత్యంత ప్రేమపాత్రుడు, కవిశేఖరుడు, వారం వారం వారబోకుండా మనసారా ఫోన్‌లో పలకరించే మంచి మిత్రుడు రాధశ్రీ ఏ గ్రంథం రాసినా, లేదా ఏ కవిత రాసినా నేను చూడవలసిందే. నాకంతటి భాగ్యాన్ని కల్గిస్తున్నందుకు డా॥ రాధశ్రీని అభినందిస్తూ ఈ శతకం లోకప్రియం కావాలని ఆశిస్తున్నాను.

*డా॥ రాధశ్రీ "శ్రీ మట్టపల్లి లక్ష్మీనృసింహ శతకం" పుస్తకానికి*

***26 - 1 - 2005***

# యథార్థజ్ఞానం

బసవేశ్వరుడు వీరశైవులకు గురువుగా ఆరాధింపబడుతాడు. కాని అతడు వీరశైవులు కానివారికి కూడా గురువని నా తలంపు. అతని వచనాలు కేవలం వచనాలు కావు. జ్ఞానప్రవచనాలు. మూలతత్త్వాన్ని స్పృశించిన అమృత వచనాలు. గురువైన బసవడు గురుముఖంగానే పరమాత్మ ఉనికి బోధపడుతుందని చెప్పిన విషయం సత్య సమ్మతమైంది.

"శివ పథమరయుటకు గురు పథము వలయు"

కుండకు మట్టి అవసరమైనట్లే పరమాత్మ ఉనికికి గురువవసరమని బసవేశ్వరుడు తెలియజేశాడు.

బసవేశ్వరుని అనుభవంలోంచి పుట్టుకొచ్చిన ఈ వచనాలు విశ్వజనులు గ్రహించదగ్గవి. ఉత్తములు సాధారణంగా ఉండవలసిన విధానాన్ని ఆయన చక్కగా (15.2) వచనంలో తెలియజేశాడు. సుఖాన్ని పూర్వజన్మ పుణ్యఫలమనీ, దుఃఖాన్ని పాపఫలమనీ, తమ కర్మలకు తామే కర్తలమనీ, పాపపుణ్యాలు తమ చేతలందే గలవని బసవని ఉద్బోధ.

బసవేశ్వరుని అనుభవసారమే వచనరూపంలో అవతరించింది. అయితే అయన వెలిబుచ్చిన భావాలు అనేకం వేదసమ్మతమైనవని నా అభిప్రాయం.

వేదం ఏకేశ్వరోపాసనను ఉద్బోధిస్తుంది. బసవడు కూడా ఇదే విషయాన్ని చెప్పాడు.

"ఇద్దరు ముగ్గురు దేవుళ్లని ఉబ్బి మాట్లాడకు, ఒక్కడే చూడుడో ఇద్దరనునది అబద్ధము" (పుట - 39). వేదం "మా గృధః కస్య స్విద్ధనమ్" ఇతరుల ధనాన్ని అపహరించవద్దని చెబుతుంది. బసవడు కూడా ఒక వచనంలో "కళబేద" అని ప్రబోధిస్తాడు.

బసవడు మహాపురుషుడు, సంస్కర్త. లోకంలో వ్యాపించిన మూఢాచారాలను ప్రతిఘటించాడు. నాగులచవితి రోజు నాగులకు పాలు పోస్తారు కాని, ఆ నాగులే కనిపించినప్పుడు ఎందుకు వాటిని చంపుతారని సూటిగా ప్రశ్నించాడు.



అద్వైతాది విభిన్న వాదాలతో విసగి వేసారిన జనానికి శివతత్త్వాన్ని ప్రబోధించి, జ్ఞాన భిక్షనొసగిన బసవేశ్వరుని వచనాలను నూటా ఎనిమిదింటిని గ్రహించి గేయ, వ్యాఖ్యానరూపంలో తేటతెనుగున సరళీకృతం చేసిన మిత్రులు శ్రీ కొండా బసవరాజుగారి కృషి ఎంతైనా అభినందనీయం.

మనం కొత్తగా చెప్పేదానికంటే, మనకంటె పూర్వులు అందించిన యథార్థజ్ఞానాన్ని మనం అనువదించి లోకానికి అందించడంవల్ల ఎంతో మేలు కలుగుతుంది. శ్రీ బసవరాజుగారి అనువాదం లోకోపకారకమైంది. వారిని ఈ సందర్భంగా అభినందిస్తున్నాను.

*కొండా బసవరాజు 'బసవ వచనామృతం' పుస్తకానికి*

***16-11-2001***

# విశ్వగీత

'యోగేశ్వరుడగు శ్రీకృష్ణదేవుడు
దనుర్ధారియగు నర్జునుడు
ఎచట ఉండిన, అచట తప్పక
శక్తి, సంపద, విజయము కల్గును'

(యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయోభూతిర్ధ్రువానితిర్మతిర్మమ)

మిత్రులు విశ్వప్రసాద్ అనువాద వైశిష్ట్యాన్ని తెలియచేయడానికి వారి అనువాదాన్ని, గీతా శ్లోకాన్ని మచ్చుకు చూపించాను. భగవద్గీత ప్రపంచంలోని అన్ని భాషలలోకి అనువదింపబడింది, అన్ని భాషలలో దానికి వ్యాఖ్యానాలు కూడా వచ్చాయి. పండిత ముక్తి రామోపాధ్యాయ వంటి పెద్దలు దాన్ని వేదానుకూలంగా వ్యాఖ్యానించారు. మొత్తం మీద గీత భారతీయ జీవనంతో పెనవేసుకొని పోయింది. ఇప్పుడెవరైనా ధర్మ గ్రంథం పేరు చెప్పమంటే భగవద్గీత అనే చెబుతారు. ఐతే గీత పూర్తిగా కృష్ణుని నోట వచ్చిందేనా అన్న అనుమానం కలుగుతుంది. స్వయంగా కృష్ణుడు చెప్పింది ఎంత? ఇతరులు చెప్పింది ఎంత అనేది పరిశోధించవలసిన అంశం.

ప్రపంచంలో ఏ వేదాంత గ్రంథమైనా, దాని మౌలిక విచారం వేదాన్ని బట్టే సాగాలి. వేదానుకూలమైన, లేదా వేద విరుద్ధమైన అంశాలను విడివిడిగా గుర్తించవలసిన అవసరం ఉంది. అలా గుర్తించక పోయినట్లైతే మనకు లభించిన ఏ గ్రంథమైనా ప్రమాణమౌతుంది.

వేదం స్వతః ప్రమాణం. 'వేదో2ఖి లో ధర్మ మూలమ్' అని మనుస్మృతికారుదు చెప్పిన మాటకర్థం అన్ని ధర్మాలకు వేదం మూలమని. ధర్మాన్ని ప్రబోధించే ఏ గ్రంథమైనా వేదం ముందు నిలబడి తన అస్తిత్వాన్ని నిరూపించుకోవలసి ఉంది.

కృష్ణుడు ద్వాపర యుగంలో జన్మించినప్పటికీ అతడు అన్ని యుగాలను ప్రభావితం చేయగలిగిన శక్తిశాలి. అతడు కేవలం ఉపనిషత్ జ్ఞానమే కాదు, వేద జ్ఞానం కల్గినవాడు. 'వేదవిదేవచాహమ్' అని స్వయంగా తాను వేద మెరిగిన వానిగా



తెలుపుకొన్నాడు. వేదానుకూలమైన అనేకాంశాలకు పెద్ద పీట వేస్తున్న గీత సర్వారాధ్యం కావడంలో ఆశ్చర్యం లేదు.

శ్రీ విశ్వప్రసాద్ భగవద్గీతలోని పద్దెనిమిది అధ్యాయాలను ఏకధాటిగా అనువదించాడు. ద్రాక్షాపాకంలో రచన ఆద్యంతం చవులూరిస్తుంది. గహనమైన వేదాంత విషయాన్ని సులభమైన శైలిలో చెప్పడం కష్టం. కాని విశ్వప్రసాద్ ఈ విషయంలో కృతకృత్యుడయ్యాడు. నాల్గుపాదాలు గల గేయాన్ని చక్కగా చతురశ్రగతిలో నడిపించినాడు.

మూలంలోని విషయాన్ని ఎంత మనోజ్ఞంగా చెప్పాడో గమనించండి.

"రాజ్య దాహమున గురువుల, పెద్దల
యుద్ధమునందున చంపుట కంటెను
భిక్షమెత్తుకొని బ్రతుకుట మేలు
మాధవా! నే యుద్ధము చేయను

ఎదుట నిలచిన ధృతరాష్ట్రసుతులు
ఎవరో కాదు మా సోదరులే
వారిని చంపుట ఉత్తమమగునా?
నావారిని నే చంపుట ఏమి?"

అని పాండవ మధ్యముడైన అర్జునుడు కృష్ణుణ్ణి ప్రశ్నించగా,

"పండితులైన ఉత్తమోత్తములు
దుఃఖించరు ఏ జీవికోసము
పుట్టుట, చచ్చుట సామాన్య విషయము
అట్టి విషయము దుఃఖించదగనిది

నీవు నేను ఈ రాజులందరు
పూర్వము ఎప్పుడు లేకుండలేరు
ముందు ముందు మనముండకపోము

బద్ధజీవుడు దేహమునందున
బాల్యము, యౌవన వార్ధక్యమ్ములు
పొందు రీతిగా మరణాంతమున
వేరొక దేహము పొందు చుండును"

అని కృష్ణుడిచ్చిన సమాధానం.

ఇక్కడ ఒక్క విషయం స్పష్టమౌతుంది. విశ్వ ప్రసాద్ భగవద్గీతను ఎన్నో ఏళ్లుగా అధ్యయనం చేసి చక్కగా జీర్ణం చేసుకున్నాడు. కుంటుపడని ధార రచనకు ఊపిరిగా నిలిచి, సామాన్యులు సైతం చదివి అర్థం చేసుకోవడంలో ఎంతగానో సహకరించింది. ప్రతి గేయంలోను పాదాలు వాక్యాలుగా కనిపిస్తాయి కాని, అంతర్గతంగా లయ అనేది ఉంది. ఆ లయే లేకపోతే పాడుకోవడం కష్టమయ్యేది.

భక్తి ప్రభావాన్ని తెలియజేసే ఈ ఖండిక గమనింపదగింది.

"నిష్కల్మషమగు భక్తి ఒక్కటే
నన్నుగాంచుటకు మంచి సాధనము
నీ మనసున గల భక్తి చేతనే
విశ్వరహస్యము గాంచితివోయి!"

లయాత్మకంగా సాగిన ఈ కవితా పలుకులను ఎంత పాడుకుంటే అంత భక్తి.

"ఎంత భక్తో అంత ముక్తి!
భక్తి యోగమే పరిపూర్ణ యోగము
అభ్యాసముచే యోగమబ్బును
అర్పణ చేసిన సిద్ధి పొందెదవు"

మొదలైన పలుకులు సహజంగా వచ్చినట్లున్నాయి. శ్రీ విశ్వప్రసాద్ చేసిన అనువాదం అనువాదంగా కాక సహజంగా ఉండి పాఠకులను విశేషంగా ఆకట్టుకుంటుందని భావిస్తున్నాను.

'ధ్యానము కన్నా త్యాగము గొప్పది'

అమృత తుల్యమైన వాక్యమిది. గీతా వాక్యం విన్నప్పుడు నాకు యజుర్వేదాంతర్గతమైన 40వ అధ్యాయం ప్రథమ మంత్రం స్మృతి పథంలో నిలుస్తుంది.

'ఈశావాస్య మిదం సర్వమ్
యత్కించ జగత్యామ్ జగత్
తేన త్యక్తేన భుంజీథా
మా గృధః కస్య స్విద్ధనమ్'



దీనికి నేను చేసిన అనువాదం

ఈచరాచర సృష్టి యంతయు
నీశ్వరునిచే నిండి యున్నది
త్యాగమతివై యనుభవించుము
పరుల ధనములనంట బోకుము.

మిత్రులు శ్రీ విశ్వప్రసాద్ గారు న్యాయవాదిగా తన ధర్మాన్ని నిర్వహిస్తూ సాహితీ వ్యాసంగాన్ని ఏమరక చేస్తున్నందుకు, ప్రత్యేకించి భవద్గీతను సామాన్యులకు కరతలామలకం చేసినందుకు హృదయపూర్వకంగా అభినందనలు తెలుపుతున్నాను.

*ఈపూరి విశ్వప్రసాద్ "శ్రీ మద్భగవద్గీత గానామృతము" పుస్తకానికి*

*26 - 1 - 2002*

## "ఆర్యభట్టు నుండి అబ్దుల్ కలాం దాకా"

సృష్టికర్త పరమేశ్వరుడు. పరమేశ్వరుని కంటె గొప్ప శాస్త్రవేత్త సృష్టిలో లేడు. సృష్టి నిర్మాణక్రమాన్ని అవలోకించినప్పుడు పరమేశ్వరుని శక్తిసామర్థ్యాలు దృగ్గోచరమవుతాయి. కనుకనే పరమేశ్వరుణ్ణి నిర్మాతగా, విజ్ఞానఖనిగా, జ్ఞానమే స్వరూపంగా కల్గిన వానిగా విజ్ఞులు లెక్కిస్తారు. అణు, పరమాణువుల సమాహారమే ఈ ప్రకృతి. ప్రకృతి అనే ద్రవ్యాన్ని తీసుకొని అద్భుతమైన ప్రపంచాన్ని సృజించాడు పరమేశ్వరుడు.

పరమేశ్వరుడు వేరు, శాస్త్రజ్ఞుడు వేరు. భూమిని గోళాకారంలో నిర్మించినవాడు పరమేశ్వరుడు ఐతే, భూమి గుండ్రంగా ఉందని నిరూపించినవాడు శాస్త్రజ్ఞుడు. భూమిని అయస్కాంతశక్తి కలదిగా నిర్మించినవాడు పరమేశ్వరుడు ఐతే, భూమికి అయస్కాంత శక్తి కలదని నిరూపించినవాడు శాస్త్రవేత్త. సూర్యుణ్ణి నిర్మించినవాడు పరమేశ్వరుడు ఐతే లాంతర్‌ను కనుగొన్నవాడు శాస్త్రవేత్త.

ప్రాథమికంగా కోట్ల సంవత్సరాల జీవకోటి అవసరాలకుగాను ఈ ప్రపంచం నిర్మింపబడింది. ప్రపంచాన్ని తగిన రీతిలో మానవుని ఉపయోగంలోకి తేగలిగిన శక్తి శాస్త్రవేత్తలకు ఉంది. సత్యాన్ని గ్రహించగలిగినవాడు శాస్త్రవేత్త కాగలుగుతాడు. శాస్త్రవేత్త ఇంద్రజాలికుడు కాడు. సత్యాన్వేషణలో తలపండిన గొప్ప విజ్ఞాని. ఒక మాటలో చెప్పాలంటే అతడొక ఋషి, Receiver . చిరకాలం పరిశోధనలు చేసి తత్ఫలితాలను జీవకోటి మనుగడకు ఉపయోగపడేలా చేసే శాస్త్రవేత్తలకు ఈ ప్రపంచం ఋణపడి ఉంది. ఈశ్వరానుగ్రహం వల్లనే విజ్ఞానఖనులు ఆవిర్భవిస్తారు. మనకు కావలసిన వస్తువులను వినిర్మించి అందజేస్తారు. ఆ వస్తువులు మానవజీవితానికి అత్యంతావశ్యకమైనవి కాగలుగుతాయి. ప్రతిభావంతులైన శాస్త్రకారుల తపస్సుకు నిదర్శనంగా నేడు మనం ఎన్నో సౌకర్యాలను అనుభవిస్తున్నాం. స్టీమర్లలో, రైళ్లలో, విమానాల్లో విహరిస్తున్నాం. రబ్బరు, అల్యూమినియం, స్టీలు మొదలైన వాటిని ఉపయోగించుకుంటున్నాం. ఫౌంటెన్ పెన్ను మొదలుకొని పవర్ మగ్గం దాకా, గడియారం మొదలుకొని కంప్యూటర్ దాకా ఎన్నో నవీనసాధనాలను మనం ఉపయోగించుకొంటున్నామంటే అదంతా మహనీయులైన శాస్త్రవేత్తల కృషి ఫలితమే.



ఐతే ఇటువంటి వారు ఎప్పుడోగాని లోకానికి రారు. The earth has no hurry to produce great people. వేదం science. వేద నిర్మాత super most scientist. కనుకనే వేదాన్ని సత్య విద్యల గ్రంథమని మహర్షి దయానందుడు పేర్కొన్నాడు. "వేదో ఖలో ధర్మమూలమ్" అన్ని ధర్మాలకు వేదమే మూలం. అన్ని పరిశోధనలకు మూలం కూడా వేదమేనని నా నిశ్చితాభిప్రాయం. సత్యాన్వేషకులైన శాస్త్రవేత్తలు జ్ఞాన, విజ్ఞాన విషయాలకు గనియైన వేదాన్ని పరిశోధిస్తే మానవాళికి మరిన్ని లాభాలు కలుగుతాయి.

డా॥ రాధశ్రీ గానం చేసిన ఈ 'విజ్ఞాన గీత' ఇప్పటివరకు జగత్తులో ప్రసిద్ధినొందిన శాస్త్రవేత్తలను గూర్చి తెలియజేస్తుంది. వారివారి పరిశోధన ఫలితాలను ఎరుక పరుస్తుంది. శాస్త్రవేత్తల కృషిని ఈ విధంగా ఒక చోట గీతమాలిక రూపంలో తెచ్చినవారు లేరు. వాణిజ్యశాస్త్రంలో డాక్టరేటు డిగ్రీపొంది, తెలుగులో ప్రముఖకవిగా తన స్థానాన్ని నిలబెట్టుకున్న డా॥ రాధశ్రీ వైజ్ఞానిక విషయాలను అధ్యయనం చేయడమే గాక, భావావేశంతో ఆ విషయాలను కవిత్వీకరించడం విశేషమని చెప్పాలి.

సుమారు నూరుమంది శాస్త్రవేత్తల గరీయప్రతిభకు ఈ 'విజ్ఞానగీత' ఎత్తిన పతాకగా భాసిస్తుంది. కేవలం అక్షరజ్ఞానం కల్గిన వారు సైతం అర్థం చేసుకొని, వైజ్ఞానికుల మహత్తర కృషికి జేజేలు అర్పించేలా చేశారు రాధశ్రీగారు. విద్యార్థులకు కరదీపికగా ఉపయోగపడే ఈ గేయకృతి పెద్దలకు సైతం అవశ్యపఠనీయం.

డా॥ రాధశ్రీ గేయశైలి అత్యంత సుకుమారమైంది. సులభగ్రాహ్యతకు ఆలవాలమైంది.

"సకల దేశములలో సంతతముపయోగపడు
రబ్బరును కనుగొనెను డన్లపు మహాశయుడు"

"గుండె చప్పుడులన్ని దండిగా వినగలుగు
స్టెతస్కోపు నొసంగె శ్రీయుతుడు లీనెక్కు"

రాధశ్రీ ఏదైనా మంచి అనిపిస్తే దాన్ని చేసి తీరుతాడు. శాస్త్రవేత్తల పరిశోధనలే కాక, వారి జీవితాల్లోని సంఘటనలు కూడా వీరి హృదయాన్ని కదిలించి వేశాయి. లోకానికి ఉపయోగపడే ఒక సైంటిస్టు లోకుల మూఢాచారాలకు బలైన సంఘటన రాధశ్రీని విచలితుణ్ణి చేసింది.

"గగనాన గ్రహరాశి కదలిక నిరూపింప
ఘనుడు గెలీలియో కనుగొనె టెలిస్కోపు

అంధ విశ్వాసముల మందబుద్ధుల మధ్య
కూలబడి పోగొట్టుకొనినాడు తన చూపు"

అనంతాకాశంలోని గ్రహతారకల్ని తన సూక్ష్మేక్షికతో దర్శించిన గెలిలియో చివరికి తన చూపునే కోల్పోవడం ఊహింపరాని విషాద సంఘటన. ఒక శాస్త్రవేత్త మనకిస్తున్నదేమిటి? ప్రతిఫలంగా మనం అతనికి ఇస్తున్నదేమిటి? ఒక్కసారి ఆలోచించివలసి ఉంది. అప్పుడే రాధశ్రీ అంతరంగం బోధపడుతుంది.

ఇటీవలనే భరత కళాప్రపూర్ణులు 'పద్మశ్రీ' నటరాజ రామకృష్ణ గారందించిన స్ఫూర్తితో రాధశ్రీ "తారామతి- ప్రేమావతి" అనే అపూర్వ గేయకావ్యాన్ని రచించారు. నా మీద ఉన్న అభిమానంతో దానికి నా చేత పీఠిక రచింపజేశారు. అంతేకాక స్నేహోపహారంగా 'చెన్నప్ప శతకం' రచించి ప్రచురించారు. మరో వంద పద్యాలను మధురంగా రచించి చెన్నప్ప శతకం (ద్విశతి) అచ్చు వేయనున్నారు. ఇదంతా చెప్పడంలోని పరమార్థమేమంటే డా॥ రాధశ్రీ నిత్య సాహితీవసంతుడు, సహృదయ వతంసుడు, నాకు మంచి ఆత్మీయుడు.

ఈ 'విజ్ఞాన గీత' ఇంతటితో ఆగక సహస్రాధికంగా ఉన్న శాస్త్రవేత్తల మహత్తర వైజ్ఞానిక ఫలాలను కూడా సంతరించుకొని ముందు ముందు మరికొన్ని సంపుటాలుగా అవతరించాలని ఆశిస్తూ, డా॥ రాధశ్రీతో చిరకాల మైత్రిని అభిలషిస్తూ వారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

*డా॥ రాధశ్రీ 'విజ్ఞానగీత' పుస్తకానికి*
***6- 12- 2002***



# "విశిష్ట గృహ వాస్తు"

శ్రీ నంచర్ల వేంకటరామాచార్యుల వారు సంకలనం చేసిన **"వేదోక్త గృహ వాస్తు"** గ్రంథం అప్పుడే ముచ్చటగా మూడు ముద్రణలు పొందినందుకు, గృహ వాస్తు విషయంలో దిశానిర్దేశం చేస్తున్న ఈ గ్రంథాన్ని పాఠకలోకం సమాదరిస్తున్నందుకు వైదిక ధర్మాభిమానినైన నాకు ఎంతో సంతోషంగా ఉంది.

అందరూ సైన్స్ అభివృద్ధి చెందిందని అంటున్నారు గాని, చాలా మందికి ఆ సైన్స్ అర్థం కావడం లేదు. సైన్స్ అంటే సత్యం. సత్యాన్ని సత్యంగా ఒప్పుకోగల పండితులు ఉన్నప్పుడు మూఢాచారాలు ఇంతగా ప్రబలవు. కాని ఈనాడు ఎక్కడ చూసినా అనాచారాలే. చేసే పనులకు ప్రమాణాలు స్వకపోలకల్పితాలు కావడం అన్ని అనర్థాలకు మూలమనక తప్పదు. అందుకే వేదాన్ని అన్ని విషాయల్లో ప్రమాణంగా గ్రహించాలని మనకు పెద్దలు ఆదేశించారు.

ఈ మధ్య కాలంలో అంగడిలో వాస్తు పేరుతో మార్గోపదేశం చేస్తున్న పండితులు అనేకులున్నారు. వస్తుతత్త్వం తెలియని ప్రతివాడూ వాస్తుశాస్త్రవేత్తగా ప్రశస్తికెక్కుతున్నాడు. ఒక వస్తువు జడమా? చేతనమా? అనే విచారం కూడా చేయకుండానే వాస్తు కథల్ని ప్రచారం చేస్తున్నాడు ఏం చేద్దాం మన ఖర్మ ! మన విద్యావిధానం మార్కులు వేసి మూర్ఖుల్ని తయారు చేయడానికే రూపొందింప బడిందా అనిపిస్తుంది. మెకాలే ప్రవేశపెట్టిన (అ) విద్యావిధానానికి మోకాలొడ్డే మహానుభావుడు ఇంకా రావలసి ఉంది.

**"లక్షణ ప్రమాణాభ్యాం వస్తు సిద్ధిః"** అని ఆర్యుల వచనం. ఒక వస్తువు సిద్ధించాలంటే దానికి లక్షణమూ, ప్రమాణమూ ఉండాలి. కాని వస్తు స్వరూపాన్ని వివేచించే వారు తక్కువయ్యారు. మనకు నాల్గు వేదాలున్నాయి. వేదాంగాలున్నాయి. ఉపనిషత్తులున్నాయి. దర్శనాలున్నాయి. ఇన్ని ఉండీ పాశ్చాత్య వాస్తు పేరుతో గ్రంథాలు రావడం, అసలు వాస్తు అంటే ఏమిటో తెలియక పోవడం ఎంత అవమానకరం!

వాస్తు గురించి ఒక్కరూ వాస్తవం చెప్పరు. ఎక్కడైనా మనిషి పేరును బట్టి వాస్తు ఉంటుందా? కర్మలనూ, కర్మఫలాలనూ గాలికి వదిలేసి ఇతరమైన వాటిని పట్టు కొన్నంత కాలం మనం బాధలు అనుభవించకతప్పదు. వాస్తు చెప్పినవాళ్లు

బాగానే ఉన్నారు కాని, వాస్తు పేరుతో ఇండ్లను కూలగొట్టుకొన్న వారి పరిస్థితి మాత్రం ఏమీ బాగాలేదు. కట్టు కున్న ఇంటిని గాలికి, వెలుతురుకు అనుగుణంగా మార్చుకుంటే సరిపోతుంది కాని, పూర్తిగా ఇంటినే కూల్చుకోవడం ఏ శాస్త్రం ప్రకారం ఒప్పవుతుంది? వాస్తు గురించి చెప్పేవాళ్ల వాస్తు పరిజ్ఞానాన్ని తెలుసుకొంటే బాగుంటుందని పిస్తుంది. ఒకసారి వారి ఇండ్లకు కూడా వెళ్లివస్తే ఇంకా బాగుంటుంది. **"ఇదేమండీ మీ ఇల్లు మీరు చెప్పినట్లే లేదు కదా!"** అంటే దానికి వారి సమాధానం **"మేం శాంతి చేయించాం. మీరూ చేయించండి"** అని. తప్పదు. ఎంతో డబ్బు తగిలేసి మనం శాంతి ప్రక్రియను నిర్వహిస్తేగాని మన ఆత్మలు శాంతించవు!

పరిశుద్ధమైన గాలి, సూర్యకాంతి ఏ ఇంట్లోకి ధారాళంగా ప్రవేశింపగల్గుతుందో, ఆ ఇంట్లో నివసించే వారికి ఆయురారోగ్యాలు లభిస్తాయి. మానసిక ప్రశాంతి, సుఖసంతోషాలు చేకూరుతాయి. ఇదే గృహవాస్తు ముఖ్య లక్ష్యం.

ఈ లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకొని ధర్మ గ్రంథమైన వేదాన్ని ప్రమాణంగా చేసుకొని శ్రీ నంచర్ల వారు **"వేదోక్త గృహ వాస్తు"** గ్రంథాన్ని వెలుగులోకి తెచ్చారు. ఆచార్యుల వారు ఈ గ్రంథంలో ముఖ్యంగా నాలుగంశాలను ప్రమాణపూర్వకంగా వెల్లడించారు. అవి 1. గృహ నిర్మాణం, 2. శిలాన్యాసం, 3. బావి ప్రారంభం, 4. గృహప్రవేశ విధి. వీటితో పాటు ప్రాకృతికశీతలీకరణ, నగరం-దుర్గం - యజ్ఞశాల, గోశాలల నిర్మాణ విశేషాలను కూడా తెలియ జేశారు.

వేదం ఏ విధంగా గృహ నిర్మాణం జరగాలో చెప్పిన మంత్రాన్ని ఆచార్యుల వారు చూపారు.

**"ఇహైవ ధ్రువాం నిమినోమి శాలాం క్షేమే తిష్ఠాతి ఘృతముక్షమాణా ।**

**తాం త్వా శాలే సర్వవీరాః సువీరా అరిష్టవీరా ఉప సం చరేమ ॥"**

**(అథర్వ॥ 3-12-1)**

(సూర్యరశ్మి సోకునట్లు, వాయువు వీచునట్లు, అన్ని ఋతువులలో సుఖ శాంతుల నిచ్చు ఇండ్లలో నుండు వారు ఆయురారోగ్యములతో, బల పరాక్రమములతో వర్ధిల్లుచుందురు. కావున అట్టి గృహములనే నిర్మింప వలయునని మంత్రార్థం.)

చాలదా గృహనిర్మాణానికి ఈ ప్రమాణం?

వాస్తు సంబంధమైన సందేహాలున్న ప్రతి యొక్కరు ఈ గ్రంథాన్ని చదవాలి. ఈ గ్రంథంలో ఆచార్యుల వారు దిశల ప్రభావాన్ని మనకు చక్కగా తెలిపారు. సూర్య



కిరణాలు మన మీద పడడం వల్ల **"విటమిన్ -డి"** తయారయ్యే విషయాన్ని వారు గుర్తు చేస్తున్నారు. ప్రాతఃకాలములో సూర్యుని లేత కిరణాలు మన మీద పడడం వల్ల లభించే శక్తి ఎంత మహత్తరమైందో చెప్పలేం. ఐతే అందుకనుగుణంగా గృహనిర్మాణం జరగాలి.

దయానందుల వారు సంకలనం చేసిన వైదిక దినచర్యను గమనిస్తే అందులో మనకు మనసా పరిక్రమ మంత్రాలు గోచరిస్తాయి. వాటిసంఖ్య ఆరు. నాల్గు దిక్కులందు, పైన, క్రింద అంతటా వ్యాపించిన పరమేశ్వరుడు మనల్ని రక్షిస్తూ ఉంటాడని వాటి భావం. ఇప్పుడు చెప్పండి ఏ దిక్కు మంచిదో? ఏ దిక్కు చెడ్డదో?

నంచర్ల వారు పాఠకుల సౌలభ్యాన్ని దృష్టిలో పెట్టుకొని గృహనిర్మాణానికి ఆధారాలైన పటాలను ఇచ్చి ఉపకారం చేశారు. వారి వివేచనాత్మక వాస్తు పరిజ్ఞానానికి ఈ పటాలు ప్రబలోదాహరణమనక తప్పదు.

ఈ గ్రంథాన్ని అనుసరించి గృహనిర్మాణం చేపడితే కలిగే లాభాలను మాటలతో చెప్పలేను.

ఎన్నో శాస్త్ర గ్రంథాలను శ్రమకోర్చి అధ్యయనం చేసి సంకలనం చేసిన ఆచార్యుల వారి **"వేదోక్త గృహ వాస్తు"** గ్రంథం అవశ్య పఠనీయం. సర్వదా అనుసరణీయం.

తెలుగు భాషలో వైదిక రీతిలో రచింప బడిన అపూర్వమైన గ్రంథంగా దీన్ని నేను భావిస్తున్నాను. పెద్దలు శ్రీ నంచర్ల వారిని హృదయ పూర్వకంగా అభినందిస్తూ, నమస్సులు అర్పిస్తున్నాను.

**నంచర్ల వేంకటరామాచార్యుల "వేదోక్త - గృహవాస్తు" పుస్తకానికి**

**10 -10 - 2005**

## "సమ దర్శనుడు"

శ్రీ యెల్ది సుదర్శన్‌గారితో వ్యక్తిగతంగా నాకు పరిచయం లేదు. కాని వారి కవితలను చూసిన తర్వాత వారు నాకెంతో పరిచయం ఉన్నవారుగా తోచారు. శ్రీ సుదర్శన్‌గారు, ప్రవాసాంధ్రులు. అయినా తెలుగు మాట్లాడటం మరిచిపోలేదు. తెలుగులో రాయడం మానలేదు. తెలుగు ప్రాంతంతో సంబంధబాంధవ్యాలను విడిచి పెట్టలేదు. పైగా తెలుగులో చక్కని కవితలను కూడా అల్లి, మాతృభాష ఋణాన్ని తీర్చుకుంటున్నందుకు నాకు చాల సంతోషంగా ఉంది.

"ఎవరు ఏమి చెప్పినా
ఏ ఆశలు చూపించినా
మన లక్ష్యం ఒకటేనోయ్
మన తెలుగువాడు గెలవాలోయ్"

చూడండి, సుదర్శన్‌గారికి తెలుగువారంటే ఎంత ప్రేమో! ఈ పంక్తులు రాయప్రోలు కవితాపంక్తులను గుర్తుకు తెస్తున్నాయి. "ఏ దేశమేగినా ఎవ్వరెదురైనా పొగడరా నీ తల్లి భూమి భారతిని" అని రాయప్రోలు మనం మరొక దేశం వెళ్లినప్పుడు వ్యవహరించవలసిన పద్ధతిని సూచించగా, శ్రీ సుదర్శన్‌గారు మనం రాష్ట్రం నుంచి మరో రాష్ట్రానికి వెళ్లినప్పుడు ఉండవలసిన విధానాన్ని సూచిస్తున్నారు.

శ్రీ సుదర్శన్‌గారు సమకాలీన సమాజాన్ని అవలోకించడం వల్ల కల్గిన స్పందనలను తేటనైన భాషలో, సుకుమారమైన శైలిలో ఆబాలగోపాలాన్ని అలరించే విధంగా అక్షరబద్ధం చేశారు.

ఇంకా ఈ రోజుల్లో ప్రతి ఒక్కరూ దేనిలోనైనా అబ్బాయిలకు మాత్రమే ప్రాధాన్యం ఇవ్వడం కవిగారికి బాధ కలిగించింది.

"అబ్బాయిలకిచ్చిన
అవకాశము
అమ్మాయిలకిస్తే
అమ్మాయిలదే పైచేయవునండి" అని యాథార్థ్యాన్ని విప్పి చెప్పారు.



నిజమే, అబ్బాయిల కంటె అమ్మాయిలే చదువుల్లో ముందుండడం మనం ఈ రోజుల్లో చూస్తున్నాం...

సంఘంలో ప్రతి ఒక్కరు బలవంతులై పోతున్నారు. తామే గొప్పవాళ్లమని భావిస్తున్నారు. ఈనాడు ముఖ్యంగా మతం, రాజకీయం ప్రజల్ని మోసం చేస్తూ ఉన్న బలమైన శక్తులు. వాటి నుంచి మనల్ని మనం రక్షించుకోవాలంటారు సుదర్శన్‌గారు.

"వినాలనుకుంటే వినండి
వినేదేదో విచారించండి"

ఈ పంక్తులు "వినదగునెవ్వరు చెప్పిన, వినినంతనె వేగపడక వివరింపదగున్" అన్న సుమతీ శతకకారుని పలుకులను పోలి ఉన్నాయి.

జీవితంలో ఏదైనా సాధించకపోతే ఆ జీవితానికి అర్థం లేదని కవి చెప్పిన మాటలు వాస్తవం. కర్త, కర్మ, క్రియల స్వరూపం తెలుసుకోలేనప్పుడు జీవించి లాభం లేదంటాడు కవి.

"ఎవడు కర్త?
ఎవడు కర్మ?
ఎవడు క్రియ? అని తెలియనిది
ఎందుకీ జీవితం?

ఈ పంక్తుల్ని విశ్లేషించినప్పుడు కొన్ని విశేషాలు బయటపడతాయి. క్రియాశీల జగత్తులో మానవుడే కర్మిష్ఠి. కర్మఫలప్రదాత పరమాత్మ. పరమాత్మకే సృష్టికర్త అని పేరు. ఇక్కడ కర్త పరమాత్మ, కర్మ జీవుడు, క్రియ ప్రపంచం. మూడు తత్త్వాల సమాహారమే ఈ విశ్వం. బహుశా వీటిని గురించి తెలిసినప్పుడే జీవితం సార్థకం అవుతుందని నా భావన కూడా.

అనేకాంశాలను అలవోకగా స్పృశించిన కవితలు ఇందులో ఉన్నాయి. అయితే ఆలోచించి రాసినవీ ఉన్నాయి. నేడు మనిషిని భయపెట్టేది కాలుష్యం. పర్యావరణాన్ని రక్షించుకోకపోతే ప్రపంచమే మిగలదు. కనుకనే సుదర్శన్‌గారు "అడవులను రక్షించండి" అని అన్నారు. "ప్రపంచమంతటి సమస్య ప్రకృతిని కాపాడుట" అని నొక్కి చెప్పడం ఈ సమస్యల పట్ల ఆయనకున్న అవగాహనను తెలుపుతుంది.

సమాజం భిన్న రుచులకు నిలయం. ఒకరికి నచ్చింది మరొకరికి నచ్చదు. ఈ సత్యాన్ని అభివ్యక్తం చేసే కవితాపంక్తుల్ని గమనించండి.

"ఒకరికి నచ్చినది
మరొకరికి నచ్చదండి
ఒకరికి విజయం
మరొకరికి ఈర్ష్యండి"

అయినా కలిసిపోవడానికి అందరూ ప్రయత్నించాలి అన్నదే కవి తలంపు.

సుదర్శన్‌గారి కవితలు ప్రబోధాత్మకమైనవి. వివిధ విషయాలను స్పృశించి పాఠకుల హృదయాలను ఎంతగానో ఆకట్టుకోజాలినవి. లోకంలో మంచిచెడ్డలున్నాయి. గమనించి మెలగడం మనం చేయవలసిన పని. అయితే ఆయనే అన్నట్లు "అనుకున్నది ఒక్కటైతే జరుగుతున్నది మరియొకటి".

లాట్రీ టికెట్టు కొని లక్షాధికారులం కావాలనుకునే వారి సంఖ్య లోకంలో ఎక్కువగానే ఉంటుంది. కొనేవాళ్లకు లక్షల మీద దృష్టే కాని, అమ్మేవాని మీద అణువంత కూడా ఉండదు. టికెట్టు కొని లాట్రీలో అదృష్టం బాగుండి లక్షలు సంపాదించవచ్చు గాని, టికెట్టు అమ్మే కుర్రవాని దురదృష్టాన్ని మాత్రం మార్చలేరు. అంతే, బస్సులో ప్రయాణం చేసి గమ్యాన్ని పట్టించుకుంటాం గాని బస్సును పట్టించుకోం గదా! బస్సు డ్రైవర్‌ను, కండక్టరును గుర్తు పెట్టుకోం గదా! ఇదీ అంతే....

"లాట్రీ టికెట్టు కొంటే
లక్షాధికారైతే
లాట్రీలమ్మే వాని
సంగతేమిటో?"

బాగుంది. ఇదొక్కటి చాలు సుదర్శన్‌గారి సమదర్శనానికి ఉదాహరణ చెప్పడానికి.

విశ్లేషించి, అందచందాలను చూపడానికి ఎన్ని కవితలనైనా గ్రహించవచ్చు. కాని సమయాభావం వల్ల అన్ని కవితలను పరామర్శించలేకపోతున్నాను. శ్రీ సదుర్శన్‌గారు ఇట్లే ఇంకా ఎన్నో కవితలు రాసి ప్రవాసాంధ్రులను మురిపించాలని ఆశిస్తూ వారికి నా హృదయపూర్వకమైన అభినందనలు తెలియజేస్తున్నాను.

*యెల్తి సుదర్శన్ పద్మశాలి 'ఉదయ కిరణాలు' కవితల సంపుటికి*

*అక్టోబర్, 2005*



# అచంచల స్వామిభక్తి

డా॥ జనువాడ రామస్వామిగారు నా చిరకాల మిత్రులు. నేను ఉస్మానియా విశ్వవిద్యాలయంలో లెక్చరర్‌గా చేరకముందే నాకున్న మిత్రకోటిలో అగ్రేసరులు వారు. పద్యాన్ని ఎంతగా సామాజిక స్పృహతో వ్రాయగలరో అంతగా భక్తిభావంతో రచింపగల దిట్ట వారు.

వారు రచించిన ఈ శతకాన్ని ఆమూలాగ్రం చదివి నా యీ అభిప్రాయాన్ని రాస్తున్నాను. చిలుకూరు పుణ్యక్షేత్రం. భక్తులు వేలకొలది ప్రతి రోజు ఆ క్షేత్రాన్ని దర్శించి ధర్మాభిమానులై పుణ్యకార్యాలు చేస్తున్నారు. ఈ క్షేత్రానికి మంచి పేరు రావడానికి కారణం ఉంది. ఉస్మానియా విశ్వవిద్యాలయం మాజీ రిజిస్ట్రార్ శ్రీమాన్ సౌందరరాజన్‌గారు ప్రధాన పూజారి బాధ్యతలను నిర్వహిస్తూ ఆలయ వ్యవస్థను మెరుగు పరిచినారు. "దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడు" అన్న వాదానికి తావు లేకుండా శ్రీ సౌందరరాజన్ గారు తమ ధర్మాన్ని నిర్వహిస్తున్నారు.

మిత్రులు రామస్వామిగారు చిలుకూరు వేంకటేశ్వరుని మీద రచించిన శతకమిది. దీనిలో సామాజికాంశాలతో పాటు ఆధ్యాత్మిక విషయాలు చోటు చేసుకొన్నాయి.

సామాజికాంశాలకు ఉదాహరణ:

"వావి వరుసలేదు వరకట్నమేయున్న
రూపురేఖలనెడు రూలు లేదు"

"ఓటుకొచ్చినపుడు ఓటరే దేవుండు
ఓటు గెలిచెనేని బూటు జూపు"

"ఇద్దరున్న నాడు ముద్దుముద్దుగ జూతు
బట్ట పొట్టపెట్టి భవ్యగతిని"

డా॥ రామస్వామిగారు ఈ శతకంలో వెలిబుచ్చిన ఆధ్యాత్మిక భావపరంపర విశిష్టమైంది. నిరాకారుడు, సర్వవ్యాపకుడు, అజన్ముడు, అద్వితీయుడైన పరబ్రహ్మ సాక్షాత్కారమే భక్తకోటికి పరమలక్ష్యం. పరమాత్మ అంతరాత్మయై వెలుగుచున్నాడు.

అతని కోసం వేరే చోట వెదకవలసిన అవసరం లేదంటారు కవిగారు.

"మనసు నిండ నీవు మసలుచునుండగా
గుళ్లు గోపురాలు కోరనేల"

ఎంతో ఆధ్యాత్మిక చింతన కలిగినవారైతే గాని వారి నోటి నుండి ఇలాంటి అమూల్యమైన వాక్కు రాదు.

ఈశావాస్యోపనిషత్తు నుండి ఈ సందర్భంగా ఒక మంత్రాన్ని ఉదాహరించాలనిపిస్తున్నది.

"యస్తు సర్వాణి భూతాన్యాత్మన్నేవానుపశ్యతి
సర్వభూతేషు చాత్మానం తతో న విచికిత్సతి" - 6

ఏ విద్వాంసుడు పరమాత్మయందు స్థావరజంగమాలను, స్థావర జంగమాల యందు పరమాత్మను దర్శించునో, అతడు సందేహాన్ని విడిచి మోక్షాన్ని పొందగలడని భావం.

నిష్కల్మషమైన మనస్సుతో పుణ్యకర్మలు చేయాలని, కర్మరహస్యం బోధపడనంత కాలం కర్త యెవరో, భోక్త యెవరో తెలుసుకోవడం అసాధ్యమని సూక్ష్మమైన విషయాలను స్పృశించారు డా॥ రామస్వామిగారు ఈ శతకంలో. ఎవరు కర్మలను చేస్తారో వారే కర్తలు. కర్మలు చేసినవారే ఈ కర్మఫలాలను అనుభవిస్తారు కనుక వారే భోక్తలు. ఈ రహస్యం తెలిసిన వారు కర్మల విషయంలో అప్రమత్తులై ఉంటారన్నది కవి అభిప్రాయం.

"కర్మవాదమందు మర్మంబు దెలియక
పనులు చేయుచున్న ఘనులు జగతి
కర్త భోక్త యెవరో కనుగొనుటయె దారి
వేడుకొందు నిన్ను వెంకటేశ"

ఐతే కర్మఫలాలను అనుగ్రహించేవాడు మాత్రం ఎన్నటికైనా పరమాత్మయే.

మతం గొప్పదైతే మనిషిలో మార్పు రావాలంటారు రామస్వామిగారు. మతం ఈనాడు మారణహోమాన్ని సృష్టించి మానవుల మనుగడకే ముప్పు తెస్తుంది. కనుక మతం కంటె మానవత్వమే ఉత్తమమైందని చాటుతున్నారు.

"మతం గొప్పదయిన మనుషులు మారాలి
కలిసియున్ననాడు కలదు సుఖము"



డా॥ రామస్వామిగారికి కపటం, మోసం, డాంబికం, వాచాలత్వం అంటే గిట్టవు. కనుకనే,

"గుణము శీలమంటు గుణితాలు వేయకు
మనసులేని మనిషి మట్టిదిబ్బ" అని చెప్పారు.

"వట్టి మాటలు కట్టిపెట్టోయ్,
గట్టి మేల్ తలపెట్టవోయ్"

అన్న గురజాడ సామాజిక దృక్పథాన్ని ఈ సందర్భంగా గుర్తుకు తెచ్చుకోవచ్చు.

"నమ్మియున్న వాని నట్టేట ముంచెడి
వింతజనులు గలరు విశ్వమందు"

నమ్మనివానికి అపకారం చేయడం ఒక పద్ధతి. కాని నమ్మినవానినే నట్టేట ముంచడం నేడు మనుష్యులకు కొందరికి అలవాటుగా మారింది. అటువంటివారిని వింతజనులు అన్నారు కవి. సాధారణంగా వింత జంతువులు అనొచ్చు. కాని జంతువులకు కోపం వస్తుందని కాబోలు అలా అనలేదనిపిస్తుంది.

భక్తి ఆధ్యాత్మిక భావ పరంపరలకే కాక, సామాజికాంశాలకు ప్రాధాన్యం ఇచ్చి, రచించిన ఈ శతకం మిత్రులు డా॥ రామస్వామి గారికి విశేష కీర్తిని కల్గిస్తుందని ఆశిస్తూ అభినందిస్తున్నాను.

*డా॥ జనువాద రామస్వామి "శ్రీచిలుకూరు వేంకటేశ్వర శతకము" పుస్తకానికి*

***11 -11 - 2002***

# ప్రతిభాదర్శనం

డా. ఇ. భద్రయ్య గారి ఈ పరిశోధన గ్రంథానికి అనేక విశిష్టతలు ఉన్నాయి. భావ కవిత్వంపై వచ్చినంతగా విస్తృత విమర్శ మరే కవిత్వోద్యమంపై రాలేదనిపిస్తుంది. నిజానికి ఈ ఉద్యమం మీద, కవులపై వచ్చిన విమర్శను స్పృశిస్తూ సమీక్షిస్తేనే వేల పుటల బృహద్గ్రంథం అవుతుంది. పరిశోధన గ్రంథాలు సమాచార పౌష్కల్యంతో అతి విస్తృతంగా రాయబడుతున్న ఈ రోజుల్లో ఇంచుమించు నూట ఎనబై అయిదు పుటల్లో అదీ భావకవిత్వంపై పరిశోధన గ్రంథం రావడం విశేషమే. ఈ పరిశోధన గ్రంథంలో ఆద్యంతం చదివించే గుణం ఉండి, వివేచన విశ్లేషణ సమతౌల్యంతో ఏదో ఒక క్రొత్త అంశాన్ని చదువుతున్నామనే అనుభూతిని కల్గజేయడం పరిశోధకుని ప్రతిభకు తార్కాణం. చర్విత చర్వణంగా కాక అనేక వినూత్నాంశాల, విశేషాంశాల ప్రతిపాదనతో పాటు సామాజిక శాస్త్రావగాహనా నేపథ్యంలో ఈ పరిశోధన గ్రంథం రావడం మరింత విశేషం.

సమాజాన్ని అవగాహన చేసుకుని సాహిత్యాన్ని పరిశీలించడం వేరు, సామాజిక శాస్త్రాంశాల్ని అనుప్రయుక్తం చేసి విశ్లేషించడం వేరు. ఈ రెండవ మార్గంలోనే పరిశోధన సాగిందనడానికి ఈ గ్రంథంలో అనేకానేక అంతర్గత సాక్ష్యాలు లభిస్తాయి. సామాజిక సాంస్కృతిక నిర్మితి (పు. 9), సామాజిక వాస్తవికత పునర్నిర్మాణం (పు. 10), సమాజంలో నిర్మాణగతమైన సమతూకం, సామాజిక వ్యవస్థాపన (పు. 11) మొదలగు సామాజిక శాస్త్ర పరిధిలోని పరిభాషా పదాలనెన్నిటినో అందులో ఉదాహరించవచ్చు. అయితే శాస్త్రవిషయ సంబంధమైన పడికట్టు పదాలను ప్రయోగించడంలోనే గొప్పతనం వుండదు. అనుప్రయుక్తంలోనే వాని గొప్పతనం వుంటుంది.

సామాజిక నిర్మితిలోని సమస్తాంశాల్లో కలిగే మార్పులు, జనాభావృద్ధి వల్ల జీవశాస్త్ర ప్రమాణాలు పెరిగాయని భావించడం, తెనుగు ప్రాంతానికి సంబంధించిన అసమతౌల్యాభివృద్ధి మొదలగు అంశాల్ని పరిశీలించడంలోనే కాక ముఖ్యంగా ఐరోపాలో వచ్చిన రొమాంటిసిజాన్ని సామాజికోద్యమంగా దర్శించడంలోను సామాజిక శాస్త్ర



దృక్పథం ప్రబలంగా కనిపిస్తూ వుంది. దీనివల్ల నవ్య కవిత్వావిర్భావ నేపథ్యానికి విస్తృత భూమిక, మరింత స్పష్టత చేకూరింది.

నూతన కవితా ప్రక్రియ ఆలస్యంగా రావడానికి గల కారణాలను విశ్లేషించుకోవడంలోను, పాశ్చాత్యుల రొమాంటిసిజంకు గల నిర్వచనాలతో పాటు భావకవిత్వం నిర్వచనాలను విశ్లేషించి సమన్వయించడంలోను వినూత్నత్వం గోచరిస్తూ వుంది. విశ్వనాథ, నాయని కృష్ణకుమారి గార్ల నిర్వచనాలను విశ్లేషిస్తూ భావకవిత్వ వస్తు నిర్ధారణలో సామాజిక వాస్తవం కాల్పనిక వాస్తవికతగా రూపుదిద్దుకోవడానికి అంతర్ముఖ వైవిధ్యమే కారణమని చెప్పడం ఎంతో లోతైన అవగాహనకు ఉదాహరణగా చెప్పవచ్చు. అందువల్లనే దేశభక్తి, సంఘసంస్కరణ శాఖలు కూడ భావకవిత్వ పరిధిలోనే ఒదుగుతున్నాయి. భావకవిత్వ వర్గీకరణలో శాఖల అంతస్తత్వాన్ని ఆధారంగా చేసుకుని వాటిని రెండు ముఖ్యవర్గాలుగా గుర్తించారు. ప్రకృతి, ప్రణయం, భక్తి, స్మృతి శాఖలను ఆత్మాశ్రయ వర్గంగాను, మిగిలిన దేశభక్తి, సంఘ సంస్కరణ శాఖలను అనాత్మాశ్రయ వర్గంగాను నిర్దేశించడం భావకవిత్వ పరిశోధనలోనే ఒక గొప్ప ముందడుగుగా చెప్పవచ్చు. ఐరోపాలో ఉద్వేగం (రొమాంటిసిజం) వివేచన (రియలిజం)లు సమాజాన్ని, సాహిత్యాన్ని ప్రభావితం చేసిన తీరు, రష్యావారి 'రొమాంటికా' (రొమాంటిక్ సాహిత్యోద్యమం)ను పాసివ్ పోయట్రీ అని, యాక్టివ్ పోయట్రి అని అక్కడ వివరించిన తీరు రెండవ అధ్యాయంలో విశ్లేషించబడింది. ఈ విశ్లేషణ భావకవిత్వంలోని శాఖలన్నిటిని రెండు ప్రధాన ధోరణులుగా గుర్తించడంలో గల సామంజస్యాన్ని బోధపరుస్తున్నది.

భావకవిత్వంలో కథ వున్నా, లేకున్నా నామమాత్రమే. కవి తన కాల్పనిక ప్రపంచంలో విహరించి చెప్పేదే వస్తువు. కవి కాల్పనిక ప్రపంచం స్వచ్ఛంగా, స్పష్టంగా ఆవిష్కృతమైతే ఆత్మాశ్రయ ధోరణి. ఇక అనాత్మాశ్రయ ధోరణి అంటే ఆత్మాశ్రయేతరమని కాదు. 'సామాజిక అస్తిత్వం గల వస్తువు అందులో వుంది. కానీ ఆ వస్తువును అప్రధానం చేసి, కవి భావప్రపంచమే ముఖ్యంగా వ్యక్తం అవుతుంది. కథ, పాత్రలతో వస్తువుకు సంబంధం లేదు' (పు. 76) అని జాగ్రత్తగా అనాత్మాశ్రయ ధోరణిని వివరించారు. అనాత్మాశ్రయ కవితాశాఖల్లో గల భావకవిత్వ మూలకాల్ని (ఎలిమెంట్స్) ఉదాహరణలతో సహా ప్రదర్శించడం పరిశోధన ప్రామాణికతను పెంచింది.

ఈ పరిశోధనలో భావకవిత్వానికి యుగకర్తలుగా గురజాడ రాయప్రోలులు చూపిన మార్గాలు, వారి కవితారచనల తారతమ్య నిరూపణలో ఎన్నో కొంగ్రొత్త అంశాలు ఆవిష్కృతమయ్యాయి. గురజాడది అసంపూర్ణ విప్లవం అంటూ ఆయనను భావ కవిత్వం నుండి వేరు చేసిన వేల్చేరు విధానం అశాస్త్రీయమనే విషయం ఈ గ్రంథం చదివితే తెలుస్తుంది.

గురజాడ నీలగిరి పాటల్లోనే కొన్ని భావకవిత్వ బీజాలున్నాయనే విశ్లేషణ గమనించదగింది. పూర్ణమ్మ, ముత్యాలసరములు కవితాఖండికల్లోని అద్భుత కవితా శిల్పావిష్కరణ పరిశోధకుని విమర్శన శక్తికి ఉదాహరణ. ముఖ్యంగా 'ముత్యాలసరములు'లోని 'ప్రేయసి కల్పనం లోకులకు ప్రతీకగా నిలుస్తుం'దని నిర్ధారించడం ఔచిత్యవంతం. లేకపోతే 'మాలమాదిగకన్నెనెవతె నా మరులుకొనరాదో' అనే పలుకులు గురజాడ విజ్ఞతకు న్యూనతను ఆపాదిస్తాయి. ఈ నిందలో 'ఐకమత్యం కలగాలంటే వర్ణాంతర వివాహాలు దానికి మార్గమనే ప్రబోధం ఉంది' (పు. 125) అనడం కవియైన విమర్శకునికే సాధ్యం. అంతేకాక ప్రేయసి కోపంతో 'సరులు త్రెంచి వాటితో ప్రియుని చరచింది', 'ఆమె లోకులకు, సామాన్య జనావళికి ప్రతీక. ఆ త్రెంచి విసరివేయబడిన సరులను గుదిగుచ్చాడు గురజాడ. అవే ముత్యాల సరాలు. జనుల వ్యవహారంలో ఉన్న ఆశుగీతాలు' అని ఇంతవరకు ఎవరూ చెప్పని గురజాడ కవితా శిల్పాన్ని ముత్యాల సరాల సృష్టిని విస్పష్టం చేశారు.

గురజాడ విశిష్ట వ్యవహారిక శైలితో కవితా భాషను ప్రజాస్వామ్యీకరణం చేసిన తీరు, ఆశురీతి, వాస్తవికత మొదలగు విశిష్టాంశాలు భావకవులను ప్రభావితం చేశాయే గాని వారికి పట్టుబడలేదని విశ్లేషించారు. రాయప్రోలు గేయానికి పద్యప్రౌఢిమను సంతరించాడని ఆంగ్లంలో తృణకంకణానికి మాతృక లేనప్పటికి లలిత, డోరాలకు అది కొనసాగింపుగా వుందని నిరూపించడం విశేషం – 'రాయప్రోలుతో పోల్చితే గురజాడ అత్యంత ఆధునికుడు' రాయప్రోలు వారిది నవ్యమార్గం. వారి ప్రయోగాలు, నవ్యతల వరకే పరిమితమైనవి' (పు. 117) అని వారి కవితా తారతమ్యాన్ని నిరూపించారు. 'వాస్తవాన్ని కళ్ల ముందుంచి కర్తవ్యాన్ని ప్రబోధించే శక్తి ఉత్తమ కవిత్వానికుంటుంది. దానికి కథ ఆలంబనం మాత్రమే. ఆ పని విభిన్నధోరణుల్లో అయిన గురుజాడ, రాయప్రోలు ఇద్దరు చేశారు' అని భావకవిత్వాన్ని విమర్శించే వారికి ధీటైన సమాధానం చెప్పారు.



సరళమైన భాష, లోతైన వివేచన, కవితాశిల్ప రహస్య శోధన, సామాజికావరణాల అనుప్రయుక్తత సిద్ధాంత గ్రంథంలోని ప్రత్యేకతలు. రావు ద్వయం, ప్రతిభగల కవులకు ముత్యాలసరం ప్రయోగశాల, సామాజిక అస్తిత్వం, అనాత్మాశ్రయం, భైరవిజం, భావగద్య, విశిష్ట వ్యవహారికం వంటి విశిష్ట పదాలెన్నో ఈ సిద్ధాంత గ్రంథంలో చోటు చేసుకున్నాయి.

డా॥ భద్రయ్యగారు స్వయంగా ప్రతిభగల కవి. వీరి 'భద్ర నరసింహ శతకం'లోని కవితాధార 'అభినవ పోతన'చే ప్రశంసలు చూరగొన్నది. విమర్శకుల దృష్టికి రాకున్నప్పటికి 'రచ్చబండ' (ముస్లిం) వారపత్రికలో 1985 ప్రాంతంలోనే ఈ శతకం 'మరుగున పడ్డ మాణిక్యం'గా కీర్తించబడింది. వీరి 'విశ్వగేయ నాటికలు' రచన డా॥ సంజీవ్‌దేవ్‌గారి దృష్టిలో 'అది ఒక విశిష్ట కవితాశిల్పం'. ఇంకా యస్వీ జోగారావు వంటి కవి పండితులెందరో ఈ పరిశోధకునిలోని ప్రతిభను మెచ్చుకున్నారు. ఇక మెచ్చుకోవలసింది వారు ఇంత కాలం పరిశోధన చేసిన విశ్వవిద్యాలయం ఆచార్యులు మాత్రమే.

డా॥ భద్రయ్యగారు నాకు మిత్రులు, సహృదయ సాహితీశేఖరులు. విశ్లేషించి లోతైన పరిశోధన చెయ్యగల సమర్థులు. అందువల్లే వారి సిద్ధాంత గ్రంథాన్ని గూర్చి నాలుగు మాటలు రాసే అవకాశం లభించింది. భావకవిత్వంపై పరిశోధన చేసేవారికి వీరి సిద్ధాంత గ్రంథం దిక్సూచిగా ఉపకరిస్తుంది. సహృదయ పరిశోధకులకు అవశ్య పఠనీయమైన ఈ పరిశోధన గ్రంథం ప్రచురింపబడుతున్న సందర్భంలో డా॥ ఇ. భద్రయ్యగారిని అభినందిస్తూ వారికి సాహిత్యంలో జీవితంలో మంచి భవిష్యత్తును ఆకాంక్షిస్తున్నాను.

*డా॥ ఇ.బి. విశ్వ 'నవ్యకవిత్వంలో భావకవిత్వం – విశ్లేషణ' పుస్తకానికి*
*జనవరి, 2000*

# పద్యమౌళి రాధశ్రీ

సర్వవ్యాపకుడైన పరమేశ్వరునికి నెలవంక తలలోని పూవులా కనిపించకపోదు. కనుకనే భగవంతుడు శశిమౌళిగా కీర్తింపబడినాడు.

క్లేశకర్మ విపాకాశాలు లేనివాడు ఈశ్వరుడు. అతని గొప్పతనాన్ని తెలుసుకోవాలంటే అతనికున్న నామాలే మనకు శరణ్యం. ఆ నామాలలో "శశిమౌళి" అనేది కూడా ఒకటని నా అభిప్రాయం.

డా॥ రాధశ్రీ నా ప్రియమిత్రుడు. పద్యమౌళి. ఆయన పద్యం హృద్యమై ఆధునికతను సంతరించుకొన్నది. ఆంధ్రదేశంలో నేడున్న కవుల్లో ప్రతి రోజు పద్యం ఒకటైనా చెప్పకుండా పచ్చి నీళ్లు ముట్టని కవి ఎవరైనా ఉన్నారా? అంటే, ఒక్క రాధాశ్రీ మాత్రమే. పద్య కవులు ఆవేశిస్తే రాధశ్రీ అయ్యాడని ఎవరైనా అంటే నేనొప్పుకోను. ప్రాచీనాంధ్ర కవుల కోరికచేత రాధశ్రీ ఆవిర్భవించాడంటే అతిశయోక్తికాదు. నిలువెల్లా పద్యమైతే – అతడు రాధశ్రీ. ఆయనకు తెలుగు సాహిత్యం కన్నతల్లికంటె గొప్పది. కవిత్వాన్ని తపస్సుగా చేపట్టిన యువకవుల్లో రాధశ్రీ అగ్రేసరుడు. సామయిక కవిత్వాన్ని రచించడంలో అతడందెవేసిన చేయి.

రాధశ్రీ కవిత్వంలో వట్టికల్పనలకే పరిమితం కాదు. బ్యాంకులో ఉంటాడు కాని కల్పనల ఒడ్డున జీవించడం అతనికిష్టం ఉండదు. (Bank అంటే ఒడ్డు అనే అర్థం కూడా ఉంది).

"ఇంద్రకీలాద్రి నున్న మల్లేశ్వరుడవు
శాశ్వతానంద కాళహస్తీశ్వరుడవు
ఈప్సితమ్ములు దీర్చు భీమేశ్వరుడవు
శరణు శరణంటి! శశి మౌళి! శంకరశివ"! – 42

రాధశ్రీ చరిత్రను, సన్నివేశాలను, కవిత్వీకరించడంలో దిట్ట అంటానికి ఈ పద్యం ఉదాహరణగా నిలుస్తుంది.

ఆయన కలంలో ఏదైనా సిరాగా మారవలసిందే. నిన్న మొన్న వచ్చిన "సునామి"ని కూడా ఆయన అక్షరబద్ధం చేసినాడు.



"ఈసురోమని ప్రజలుండ నీ 'సునామి'
ఏలవచ్చినదో – నీదులీలనెరుగ"

అని శివునితో పలికిన పలుకులు అతని భక్తి విశ్వాసాలతో పాటు ప్రజలతో గల అనుబంధాన్ని స్పష్టపరుస్తున్నవి.

శైవ సంబంధమైన కవితలల్లగల నేర్పు తనకు "పలుకు పలుకున తేనియలొలుకుచున్న పాల్కురికి సోమనాథుని భవ్యమైన కవనమును జూడ" కలిగెనని వినయంగా చెప్పుకొన్న విద్వత్కవి రాధశ్రీ.

"శర్వ నీ పాదముల జేర్చు చదువె చదువు" అన్న పంక్తి పోతన్నను గుర్తుకు తెస్తుంది. కవితా సంపద, భక్తి భావసంపద పుష్కలంగా ఉన్న కవి రాధశ్రీ.

శివుని గుణగణాలను మెచ్చుకుంటూనే అతనిలోని లోపాలను కూడా ఎత్తిచూపడం రాధశ్రీకే చెల్లింది. మన్మథుని దహించినశివుడే మోహినికి మోకరిల్లడం మంచిగా అనిపించలేదు రాధశ్రీకి.

"మదన దేవుని నీ కంటి మంట యందు
భస్మ మొనరించి యున్నట్టి భాసురాంగ!
మోహమేలనో 'మోహిని' మోము చూడ
శరణు! శరణంటి! శశిమౌళి! శంకర! శివ!"

బహుశా రాధశ్రీ లాగా కవులు మంచి చెడ్డలను సహృదయంతో విశ్లేషిస్తే సమాజం తప్పక బాగుపడుతుంది.

*డా॥ రాధశ్రీ "శశిమౌళి శతకం" పుస్తకానికి*

***28 – 2 – 2005***

# ఆత్మీయతకు ఆకృతి లింగప్పగారి కృతి

అనుకరణలకీ, అనువాదాలకీ, అసందర్భాలకీ, అసంగతాలకీ తావులేని సహజమైన కవిత లింగప్పగారిది. ఇజాలతో పనిలేకుండా ఇష్టమైన విషయాన్ని మృష్టాన్నంగా వడ్డించిన కవి వలలుడాయన. చిత్తశుద్ధితో పాటు లక్ష్యశుద్ధి ఉన్నప్పుడు కవి ఏకవాక్యం రాసినా అది కావ్యం అవుతుంది. చిత్తశుద్ధిలేని శివపూజల్లాగానే, లక్ష్యశుద్ధిలేని రాతలూ వ్యర్థమే. ఏదో రాస్తున్నామని రాయడమే లక్ష్యంగా పెట్టుకొని రాసినప్పుడు ఆ రాతలు కాగితాలకే పరిమితమవుతాయి తప్ప దేనికీ ఉపయోగపడవు. లింగప్పగారి కవిత్వంలో ఆడంబరాలు కనిపించవు. అతిశయోక్తులు వినిపించవు. అనుభవాలు వారి కవితాప్రేరణ శక్తులు. జీవితానుభవమే వారిచేత కలం పట్టించింది. ఇప్పటికీ తమ బాల్యంలోని మధురానుభవాలను చక్కగా కవితాబద్ధం చేయగల ధీశాలి లింగప్పగారు. మానవ జీవితంలో స్నేహం గొప్పదని గుర్తించడమే గాక దాన్ని అక్షరాలా ఉపాసించినవారు బసలింగప్పగారు. ఏది అధికంగా తృప్తి కలిగిస్తుందో, ఏది ఆరాధింపదగిన వస్తువుగా భావింపబడుతుందో, దానికి దెబ్బ తగిలితే ఏ వ్యక్తీ ఊరుకోడు. బసవలింగప్పగారి మనఃప్రవృత్తి కూడా అలాంటిదే. వారి కవితలను పరిశీలించినప్పుడు ఆత్మీయతకు వారిచ్చిన స్థానం గొప్పదనిపిస్తుంది. వారిలాగా "బాధలో వున్నవాళ్లతో జతకట్టడం తెల్సినవాణ్ణి" అని ఎంత మంది అనగలుగుతారు! స్నేహం విలువ తెలిసినవారు తప్ప. లింగప్పగారు నిత్యజీవితంలో స్నేహానికిచ్చిన ప్రాధాన్యం మరి దేనికీ ఇవ్వలేదనిపిస్తుంది. స్నేహం సరిహద్దులు లేనిది. దానికి పరిధి విశాలమైన విశ్వమే. కనుకనే వారు "విశాల విశ్వం సంకుచితం కావడం నాకిష్టం లేదు" అనగలిగారు. రాను రాను ప్రపంచం అన్ని విషయాల్లో విశాలమౌతూ, స్నేహం విషయంలో మాత్రం సంకుచితం కావడం వారికి నచ్చలేదు. లింగప్పగారు తమ కవిత్వంలో స్నేహానికి అగ్రతాంబూలం ఇచ్చారు.

"మంచి గంధం లంటి స్నేహాన్ని
మళ్లీ మళ్లీ ఆహ్వానించే మనస్తత్వం నాది" – నవనవోన్మేషం.

ఇలా ఎంతమంది హృదయపూర్వకంగా చెప్పగలుగుతారు? ఇంకో విశేషమేమంటే "నా నిజమైన స్నేహితులు నన్ను విడిచిపోలేరని" చెప్పడం. కవిత్వానికి ఏ లక్ష్యం ఉండాలని అనుకుంటామో, ఆ లక్ష్యమే ఇది. ఏం చెబుతున్నాం? ఎందుకు



చెబుతున్నాం? ఎవరికి చెబుతున్నాం? ఎట్లా చెబుతున్నాం అనేవి కవిత్వం విషయంలో ముఖ్యంగా గమనింపదగ్గ అంశాలు. కొత్తగా చెప్పేది ఏమీ లేనప్పుడు, దిశానిర్దేశానికి తావే లేనప్పుడు రాయడం కన్న మిన్నకుండడం మేలు. అగ్గిపుల్లా, సబ్బుబిళ్లా కవిత్వానికి అనర్హమైనవి కాకపోవచ్చు కాని, వాటి ద్వారా కవి ఉద్దేశించిన లక్ష్యాలు సిద్ధించకపోతే తద్వస్తు స్వీకరణం వ్యర్థమే. వర్ణనం వ్యర్థమే.

లింగప్పగారు సమకాలీన సంఘటనలకి విశేషంగా స్పందించారు. వారి కవిత్వంలో అది స్పష్టంగా కనిపిస్తున్నది. నిన్నమొన్న జరిగిన గుజరాతు అల్లర్లను గూర్చి రాస్తూ "గుజరాతుకు కాదు నా గుండెకు గాయమైంది" అన్నారు. ఈ ఒక్క కవితాపంక్తి చాలు వారి మనస్సు ఎంతగా శోకసాగరమైందో వివరించడానికి. ఎదురుచూస్తున్నది అనే కవితాఖండిక వారి మానవీయ దృక్పథాన్ని తెలియజేస్తుంది. "వృద్ధాప్యం మృత్యువు కాదక్కడ, ఉన్మాదమే మృత్యువై మనిషిని కబళిస్తుందక్కడ" అన్నారు. మనిషి సహజ మరణాన్ని కోరుకుంటాడు. కాని మనిషికి మరో మనిషి అకాలమృత్యువు కావడం శోచనీయం. ప్రేమతత్త్వమే మూలసూత్రం కావలసిన మతం ఉరితాడు కావడం కవిని కంటతడిపెట్టించింది. మతాల పేర్లు చెప్పకుండా అవి చేస్తున్న ఆగడాలను ఎత్తిచూపాడు కవి ఒకచోట.

"అత్తరూ పన్నీరూ చల్లాల్సిన మతాలు విషాన్ని వెళ్ళగ్రక్కుతున్నాయి" అని. ఇట్లే మరోచోట –

"ఇదేమి ఉన్మాదం
ఇదేమి ఉగ్రవాదం
ఇదేమి మతోన్మాదం" అని గర్జించింది వారి కలం.

హింస, దౌర్జన్యం, అన్యాయం, అజ్ఞానం పెరిగిపోయి పురోగమనానికి బదులు తిరోగమనానికి ఆహ్వానం పలుకుతున్న వ్యవస్థ ఏ కవినైనా కదిలిస్తుంది. కారుణ్యం లేకపోతే గుండెకు అర్థమే లేదంటారు లింగప్పగారు. కనుకనే "గుండె చెలమని ఎండనివ్వకండి, గుండె గులాబీని వాడనివ్వకండి" అని సుకుమారంగా హెచ్చరిస్తారు. "తడి గుండెను ఎడారిగా మార్చే యుద్ధ ట్యాంకులకు స్వాగతం చెప్పకండి" అంటూ రోజురోజుకు పెరిగిపోతున్న యుద్ధోన్మాదాన్ని కవి కళ్ల ముందు నిలుపుతారు. నగరంలో జీవిస్తున్న కవి పల్లెను మర్చిపోతాడేమో కాని, నగరజీవితాన్ని ఎప్పుడో ఒకప్పుడు కలంలో బంధించకుండా ఉండడు.

"ప్లాస్టిక్ పూలు తప్ప
బంతిపూలు నవ్వడం లేదు"

కృత్రిమత్వం పెరిగిపోతున్న వైనాన్ని కవి చక్కగా చిత్రించడానికి మంచి ఉదాహరణ ఈ కవితాపంక్తి.

లింగప్పగారు విషయాన్ని ఎంత వాచ్యంగా చెప్పి రక్తి కట్టిస్తారో, వ్యంగ్యంగా చెప్పి అంతకంటె గొప్పగా రక్తి కట్టిస్తారు. "అందమంటే ఇదేనేమో" అనే కవితాఖండిక లక్షణామూల వ్యంజనకు చక్కని ఉదాహరణ. ఎకనామిక్స్ మాస్టర్ డిగ్రీ కలిగిన బసలింగప్పగారు మానవ హృదయాలను గూర్చి ఎంత గొప్పగా రాయగలరో దేశ ఆర్థిక స్థితిగతులను గూర్చి కూడా అంతే గొప్పగా రాయగలరు.

"ఎగుమతులకంటె దిగుమతులే అందం
పైరగాలి కంటె పడమటి గాలే అందం"

ఈ పంక్తుల్లో మొదటి పంక్తి మన దేశపు వ్యాపార సరళిని సూచిస్తే రెండవ పంక్తి దేశ సంస్కృతిని తెలియజేస్తుంది. రెండూ వేర్వేరు విషయాలైనా ఒకదాని తర్వాత మరొకటి ఉండడం వల్ల, రెండింటికీ గల కార్యకారణ సంబంధాన్ని కూడా ఊహించవచ్చు.

లింగప్పగారి కవిత్వంలో Nativity పాళ్లు ఎక్కువే. ఒకదారినవుతున్నా, జ్ఞాపక స్పర్శ, చిన్నప్పటి నా వూరు, పైసల చెట్టు - బియ్యం చెట్టు, మొదలైన కవితాఖండికలను అందుకు ఉదాహరణగా చూపవచ్చు.

కవి జీవితాన్ని గూర్చి ఆలోచిస్తాడు. తాత్త్వికుడుగా దాని మంచిచెడ్డలను గుర్తిస్తాడు. మానవ జీవితం కేవలం సుఖదాయకమూ కాదు, కేవలం దుఃఖదాయకమూ కాదు. రెండింటి సమ్మేళనమే అది. సుఖదుఃఖాలు ఒకదాని తర్వాత ఒకటి మనిషిని ఆవహిస్తాయి. దుఃఖం ఎదురైనా సుఖం ఎదురైనా అది జీవితం అంటారు లింగప్పగారు. కేవలం సుఖం అనుభవించడమే జీవితం కాదని చెప్పడం ఎంతో అనుభవంతో కూడిన మాట.

ఈ పంక్తులు గమనించండి.

"నదులెన్ని కలిసినా సింధువు సింధువే
సుఖదుఃఖాలెన్నెదురైనా జీవితం జీవితమే"

"పవిత్రమైన చరిత్ర నిర్మలమైన జలం లాంటిది" అంటూ వారు మానవ



జీవన విధానానికి గల ప్రాముఖ్యాన్ని తెలియజేస్తారు. అంతేకాదు "గమ్యం కంటె గమనం ముఖ్యం" అని చెప్పడంలో కర్మఫలం కంటె కర్మ ముఖ్యం అన్న గీతాసందేశం ఉంది.

కవిత విశ్వజనీనం కావాలనుకున్నప్పుడు ఆ కవికి స్వపర భేదం ఉండకూడదు. కుల, మత, వర్గ, ప్రాంత, స్థాయి భేదాలలో చిక్కుకోరాదు. ఆత్మలను కలిపే ధర్మాన్ని ఆచరణలో పెట్టినప్పుడే మనిషి మనీషి కాగలుగుతాడు. నేటి కవి స్వీయ కవితాపరంగా ఊరి పొలిమేరలు కూడా దాటలేని పరిస్థితి కనిపిస్తుంది. ఒకవేళ కవిత్వంలో కనిపించినా, ఆచరణలో మాత్రం కవి వెనుకబడే వున్నాడు.

కాని లింగప్పగారి తపన వేరు. కవితాధర్మం అంటే ఏమిటో వారు స్పష్టంగా తెలియజేశారు

"విశ్వభావన నేను కోరుకుంటున్నది
నవ్యభావన నేను కావాలనుకుంటున్నది
దివ్యభావన నేను చేరాలనుకుంటున్నది" అని.

బసలింగప్పగారి కవితాసంపుటిని చదువుకుంటూ పోతుంటే ప్రతి కవితను గూర్చి విశ్లేషించాలనిపిస్తుంది. "పైసల చెట్టు - బియ్యం చెట్టు" కవిత రెండు తరాల అనుభవాలకు సంకేతం. తనకూ, తన తల్లిగారికీ మధ్యన జరిగిన సంభాషణలో పైసల చెట్టు ప్రస్తావన వస్తే, తనకూ తన అమ్మాయికీ జరిగిన సంభాషణలో బియ్యం చెట్టు ప్రస్తావన వస్తుంది. అమ్మ సమాధానం ఒక పరిణత మూర్తిగా ఇచ్చినట్లు ఉంటే, అమ్మాయి ప్రశ్న మాత్రం అర్భకపు ప్రశ్న అని కవి వాటి తారతమ్యాన్ని తేల్చి చెప్పాడు. సహజత్వం నాటి జీవితానికి ప్రత్యేకత కాగా కృత్రిమత్వం నేటి జీవితంలో అడుగడుగునా కనిపిస్తుంది.

'తోడు' అనే ఖండికలో లింగప్పగారు ప్రకృతికీ తనకూ గల అవినాభావ సంబంధాన్ని వివరించారు. అనాదిగా ప్రకృతి రహస్యాలను తెలుసుకోవడానికి మనిషి ప్రయత్నిస్తూనే ఉన్నాడు. కాని ప్రకృతి అందాలకు ఆకర్షితుడు కావడమే తప్ప దాని స్వభావాన్ని అర్థం చేసుకోలేకపోవడం గమనార్హం. నిజమే ఎవరు ప్రకృతి స్వభావాన్ని అర్థం చేసుకోగలుగుతారో, వారే శాశ్వతమైన ఆనందాన్ని పొందగలుగుతారు.

'అద్వైతం' అనే కవిత నదికీ, జీవునికీ గల అభేదాన్ని సూచిస్తుంది. "పవిత్రమైన చరిత్ర నిర్మలమైన జలంలాంటిది" అంటారు కవి. ఈ రెండింటికీ మనిషిని పునీతం చేసే శక్తి ఉందంటారు కూడా. ఈ సందర్భంగా ఈ క్రింది పంక్తులను తప్పక పరిశీలించి వాటిలోని సత్యాన్ని గ్రహించవలసిందే.

"సాగితే ప్రవాహం
కొనసాగితే జీవితం"

లింగప్పగారు చెప్పదలుచుకున్న విషయాన్ని ఎంత స్పష్టంగా చెప్పగలుగుతారో ఈ పంక్తులను బట్టి తెలుసుకోవచ్చు. సాగకపోతే స్నేహం కాదు, కొనసాగకపోతే జీవితం కాదనే వ్యంగ్యార్థం స్ఫురిస్తుంది. ప్రవాహానికీ, జీవితానికీ కేంద్రాలు నది మరియు జీవుడు. ఈ రెండింటికి గల అద్వైతానుబంధాన్ని కవి చిత్రించిన తీరు అద్భుతంగా ఉంది.

లింగప్పగారి వ్యక్తిత్వాన్ని తెలుసుకోవడానికి వారి కవితాసంపుటిలోని కవితలను ఎన్నైనా ఉదాహరించవచ్చు. కవిత్వంలో ఏదో విధంగా కవి ఆత్మీయత బహిర్గతమవుతూనే వుంటుంది. లింగప్పగారి విషయంలో మాత్రం ఇది ఎక్కువే అనిపిస్తుంది. ఒకచోట వారు –

"స్వార్థం దుప్పటి వెచ్చగా ఉంటుందని
సూర్యోదయమైనా అలాగే కప్పుకొని ఉండకు" అంటారు.

స్వార్థం మంచిదికాదు. అది దుప్పటిలాంటిది. దాన్ని కప్పుకొంటే వెచ్చగా ఉంటుంది. చలికాలంలో చలి నుండి బయటపడడానికి దుప్పటి కప్పుకుంటారు. కాని స్వార్థం అనే దుప్పటిని మాత్రం అన్ని కాలాల్లో కప్పుకుంటారు. ఇది ఎంతవరకు భావ్యం అన్నది ప్రశ్న. ఆచరణకు సంబంధించిన మౌలికమైన అంశాన్ని స్పృశిస్తున్న కవితా పంక్తి ఇది.

ఈ కవితాసంపుటిలోని మరో రెండు విశేషాలను ముచ్చటించి నా సుదీర్ఘాభిప్రాయాన్ని ముగిస్తాను. వాటిలో ఒకటి నగర జీవన వర్ణన. రెండు ఆర్ట్స్ కాలేజీలోని 57వ నెంబరు గది.

పూర్వం నగరంలో గ్రామాల్లో లాగా ఆత్మీయత పుష్కలంగా ఉండేది. "ఆత్మీయత కుప్పలుగా పోసిన అనుబంధాలు ఆనాటివి" అని కవి స్వయంగా తెలియజేస్తున్నారు. "ఎవరిని పలకరించినా గంటకు తక్కువ మాట్లాడేవారు కాదు" ఇప్పటి నగరవాసులకు టైం చాలా తక్కువ అనే సంగతి గుర్తుకు తెస్తుంది ఈ పంక్తి. "ఆసుపత్రులూ తక్కువే– రోగాలు తక్కువే" అన్న వాటిల్లో చమత్కారం తొంగిచూస్తుంది. పెరిగిపోతున్న జనాభాను, విస్తరిస్తున్న నగరాన్ని మనం ఎంతైనా ఊహించుకోవచ్చు. "సైకిలెక్కిపోతుంటే ఆపి మరీ పలకరించే వాళ్ళు" అన్నవాక్యం నగరంలో పెరిగిపోయిన ఆటోలను, స్కూటర్లనూ, కార్లనూ ఇతర శకటాలను మన కళ్లముందు నిలుపుతుంది.



నిజమే ఈ రోజు భాగ్యనగరంలో రోడ్డుమీద బండి ఆపి రెండు నిమిషాలు ఎవరితోనైనా మాట్లాడడం కష్టమే. నగరంలోని వాహనాల వేగాన్ని పరిశీలిస్తే, రోడ్లు పరిగెత్తుతున్నట్లు అనిపిస్తాయంటారు బసలింగప్పగారు.

ఆర్థిక శాస్త్రం చదివిన లింగప్ప ఆ విషయాన్ని కవిత్వంలో అభివ్యక్తం చేయకుండా ఎలా ఉంటాడు?

"ష్యూరిటీలు లేకుండానే అప్పులభించేది"

నిజమే ఇప్పుడు నగరాన్ని పీడిస్తున్నవి అప్పులు. అప్పులు తీసుకొన్నవాళ్ళు బాగున్నారేమోకాని ష్యూరిటీలకు వచ్చింది కష్టం!

ఇక "ఆ హాలు!" కవిత

ఆశ్చర్యాన్ని అభివ్యక్తపరిచే ఆహాకు బహువచన ప్రత్యయం చేరిస్తే కూడా 'ఆహాలు' అనే శబ్దం ఏర్పడుతుంది. ఆహా అనిపించే ఉస్మానియా యూనివర్సిటీ ఆర్ట్స్ కాలేజీలోని ఒక హాలు గురించి లింగప్పగారు రాసిన కవిత పలువురి మన్ననలకు కూడా పాత్రమైంది.

కవితను ఆరంభిస్తూనే కవి "అది సుయోధనుడు పరాభవం పొందిన మయసభ కాదు" అన్నారు. ఆ హాలు మయసభ కాకపోయినా అంతటి ప్రశస్తి పొందిందన్న మాట మాత్రం నిజం.

"అక్కడి ప్రసంగాలకు బద్ధులౌతారు, శుద్ధులౌతారు"
ఆ హాలు ప్రత్యేకతను చాటే మాటలివి.

"సత్యం, శివం, సుందరం ఆ భవనం" అని లింగప్పగారు తాము ఉద్యోగబాధ్యతలు నిర్వహిస్తున్న యూనివర్సిటీలోని ఆ హాలు గురించి చెప్పిన మాటలు యథార్థమైనవి. ఎందుకంటే నేను కూడా అక్కడ పనిచేసిన వాణ్ణే!

ఆ హాలు గురించి చెప్పిన ఈ పలుకులనే వారి కవితకు అన్వయిస్తూ, ఆత్మీయతకు ప్రతీకగా నిలిచే లింగప్పగారు ముందు ముందు ఇలాంటి కవితా సంపుటాలను విరివిగా వెలుగులోకి తెస్తూ తెలుగు సాహిత్యానికి ఉత్తేజాన్ని కలిగించాలని ఆశిస్తూ, మనఃపూర్వకంగా అభినందిస్తున్నాను.

**బసలింగప్ప "అనేక నేనులు" పుస్తకానికి**

***31 - 12 - 2002***

# వేదవ్రతులకు అభినుతి

ఆచార్య వేదవ్రత మీమాంసకులు ప్రాచీన గురుకుల సంప్రదాయానికి చెందినవారు. బ్రహ్మచర్య దీక్షావ్రతులై స్వయంగా ఆర్షగురుకులాన్ని నడుపుతున్నారు. ఆచార్యులవారి ఈ గురుకులం ఇందూరు (నిజామాబాదు) కామారెడ్డిలో ఉంది. ఎందరో విద్యార్థులను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దే ఈ గురుకులం కేవలం కామారెడ్డికే కాక యావద్భారతదేశానికే మకుటాయమానమైంది. వేదవేదాంగాలను, ఉపనిషద్దర్శనాలను, సమస్త ధర్మగ్రంథాలను ఆపోశనం పట్టిన అపర అగస్త్యులు స్వామి వేదవ్రత మీమాంసకులు. యమనియమ నిష్ఠాగరిష్ఠులై పాతంజల యోగాన్ని నిరంతరం అభ్యాసం చేస్తూ ముముక్షువులకు కర్తవ్యోపదేశాలు చేసే ఆచార్యుల జీవనం ప్రశంసార్హమైంది.

శాస్త్రీయమైన దృక్పథాన్ని, సత్యనిష్ఠను కల్గిన ఆచార్యులవారు తమ సమయాన్ని ఎక్కువగా స్వాధ్యాయానికి వినియోగించడం ఆంధ్రుల అదృష్టమనే చెప్పాలి. ముఖ్యంగా వారి స్వాధ్యాయానుశీలనాలవల్ల వేదాల్లోని వైజ్ఞానికాంశాలతో పాటు జ్యోతిష్య సంబంధమైన అనేకాంశాలు లోకానికి తెలిశాయి. వారు వేదాల్లోని జ్యోతిష్యాన్ని గూర్చి మాట్లాడుతుంటే మనం తప్పక వినితీరాలి. అది వారి నిరతానుశీలానికి, స్వాధ్యాయానికి సంకేతమని చెప్పవచ్చు.

ఆచార్య వేదవ్రతగారి లేఖిని నుంచి జాలువారిన అక్షరస్రోతస్విని ఈ గ్రంథం. ఇంతకు పూర్వమే దీని మొదటి భాగం వెలువడింది. ఇది రెండవభాగం. మొదటి భాగంలో వేదం ఈశ్వరీయ జ్ఞానం ఎలా అయిందో, వేదం సత్యవిద్యలకు ఎలా మూలమో, వేదం విశ్వశాంతి మార్గాన్ని ఎలా నిర్దేశిస్తుందో, వేదంలో జ్యోతిష్యం ఎలా వర్ణింపబడిందో వివరించబడ్డాయి. ఆచార్యులవారి విశ్లేషణ సప్రమాణంగా సాగి చదువరులకు ఎంతో విజ్ఞానాన్ని అందిస్తుంది.

ఆచార్యులవారు ఏమి వ్రాసినా అది మనను వేద విజ్ఞానం పట్ల ఆకర్షితులను చేయడమే గాక ఆలోచనాపరులను చేస్తుంది. క్రమంగా ఆచరణశీలురను కావించడానికి దోహదపడుతుంది. మొదటి భాగంలోని చివరి వ్యాసం అత్యంత పఠనీయమైంది.



మన చరిత్ర ఏంటో మనకే తెలియని స్థితిలో, సృష్టి మొదలుకొని మహాభారత యుద్ధపర్యంతం ఆర్యుల వైదిక చక్రవర్తి రాజ్యము ఉందన్న విషయాన్ని ఆచార్యులవారు సోపపత్తికంగా నిరూపించి మనను చరితార్థులను చేసినారు.

'వేదవిజ్ఞానము' ఈ రెండవ భాగం ద్వారా ఆచార్యులవారు మనకు మరిన్ని విషయాలు తెలుసుకొనే భాగ్యం కల్గిస్తున్నారు. వేదాలలోని అంతస్సాక్ష్యాలను బట్టి, స్మృతులను బట్టి, దర్శనేతిహాసాలను బట్టి వేదప్రాశస్త్యాన్ని వారు నిరూపించిన తీరు మిక్కిలి శ్లాఘనీయం. వేదం పట్ల అభిమానం, ఆసక్తి దాదాపు సన్నగిల్లుతున్న ఈ రోజుల్లో ఆచార్యులవారు చేస్తున్న ఈ మహత్కార్యాన్ని వైదికులందరూ మెచ్చుకొనదగింది. ఈ రోజుల్లో ఏ పుస్తకంగాని, ఏ పత్రికగాని, చివరికి ఏ రచనగాని చూసినా వానిలో వేదానుకూలమైన అంశాలకు కొరత కనిపిస్తుంది, దాదాపు మృగ్యమనే చెప్పాలి. ఇటువంటి సందర్భంలో పూర్తిగా వేదధర్మానుకూలమైన పత్రికను ఒకదానిని నడిపే భారాన్ని ఆచార్యులవారే తమ భుజస్కంధాల మీద వేసుకొని, అసిధారావ్రతంగా నడుపుతున్నారు.

ఆచార్యులవారీ గ్రంథంలో వేదములెన్ని అన్న విషయాన్ని కూలంకషంగా పరిశోధించి వేదాలు నాలుగనీ, వేదపరిజ్ఞానం మానవజాతి ఆవిర్భావం నుండి నేటివరకు అవిచ్ఛిన్నంగా కొనసాగుతుందని అనేకోపపత్తులతో తేటతెల్లం చేశారు. లోకంలో కావ్యం, పురాణం, సంగీతం, పంచమవేదమనే పేరుతో వ్యవహరింపబడడం మూలంగానూ వేదాలు నాల్గు అనే విషయం ధ్రువపడుతుందని చెప్పిన ఆచార్యులవారి హేతువు కూడా సమంజసంగా ఉంది. ఇది వారి సూక్ష్మేక్షికకు ఒక తార్కాణం.

ఆచార్యులవారి వేదపటిమను, విషయ విశ్లేషణాచాతురిని తెలుసుకోవాలనుకునేవారికి 'వేదోక్త త్రైతవాదము' చక్కని విందు. నిర్మాణాత్మక క్రియలు లేదా వ్యవహారాలు త్రివిధ పదార్థాలతో సంబంద్ధమై ఉంటాయని చెబుతూ అందుకు ఎన్నో ఉదాహరణలిచ్చారు. గృహం, గృహంలో నివసించేవారు, గృహ నిర్ణేత ఈ మూడూ ఉన్నప్పుడే గృహవ్యవహారం సిద్ధమవుతుందని చెబుతూ నిర్మాణానికే కాక విధ్వంసనానికి కూడా మూడు పదార్థాలవసరమని వారు చేసిన విశ్లేషణ పాఠకులకు విషయం పట్ల ఆసక్తిని, ఆలోచనను రేకెత్తిస్తుంది. ఉదాహరణకు విధ్వంసం చేయవలసిన గృహం, గృహాన్ని విధ్వంసం చేసేవారు, విధ్వంసక సాధనాలు ఈ మూడూ లేనిదే విధ్వంసన

కార్యాన్ని నెరవేర్చలేమని చెబుతూ దేనికైనా మూడింటి అవసరాన్ని ఎత్తి చూపారు ఆచార్యులవారు. నేను ఈ విషయాన్ని ఎందుకు మళ్లీ మళ్లీ చెప్పవలసి వచ్చిందంటే ఆచార్యులవారిలో ఒక పండితుడే కాదు ఒక మంచి బోధకుడు కూడా ఉన్నాడు. వారేవిషయం చెప్పినా సప్రమాణంగా చెబుతారు. సత్యనిష్ఠతో చెబుతారు. మన మనస్సుకు హత్తుకునేలా చెబుతారు. ఉపనిషత్తులను పరిశీలించినప్పుడు ఈ పద్ధతి మనకు కనిపిస్తుంది.

ఈ విధంగా ఈ గ్రంథంలోని గొప్పదనాన్ని, ఆచార్యులవారి వైదుష్యాన్ని గూర్చి ఎంతైనా చెప్పవచ్చు. ప్రాచీన ఆర్షగురుకుల సంప్రదాయాన్ని పునరుజ్జీవింపజేస్తూ, వైదిక వాఙ్మయాన్ని ప్రచారం చేస్తూ, శిష్యులకు కర్తవ్యోపదేశాలు గావిస్తూ సేవ చేస్తున్న ఆచార్య వేదవ్రత మీమాంసకులవారిని అభినుతిస్తూ వారి ప్రతిభలో శతాంశమైనా పొందే అవకాశాన్ని ఆ పరమేశ్వరుడు మనకనుగ్రహించాలని ముగిస్తున్నాను.

*ఆచార్య వేదవ్రత మీమాంసక 'వేదవిజ్ఞానము' పుస్తకానికి*

***1999***